శ్రీ కృష్ణజయంతీ సంచిక.

# గీతావాణి

38






నాల్గవ సంవత్సరము  రెండవ సంచిక

[illegible]

## శ్రీగీతాసాహిత్యసేవాసమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

15 ఆగస్టు 1954

# విషయసూచిక - ఆగస్టు '54.







## విజ్ఞప్తి.

సుప్రసిద్ధ గీతాప్రచారకులును బ్రాహ్మీభూతులును నగు శ్రీశ్రీశ్రీ చిద్ఘనానందసరస్వతీ స్వాములవారి (పూర్వాశ్రమమున శ్రీ కోరంకి వెంకటరామశర్మగారు) సంక్షిప్త జీవిత చరిత్రమును గీతావాణిలో ప్రకటింపతలంచినాము. శ్రీవారితో పరిచయము కల్గియుండిన భక్తులు యెవరైనను వారి జీవితమును వారి గీతాప్రచారమునుగూర్చిన సమాచారములను వీలైనంత క్లుప్తముగ వ్రాసి పంపవలెనని ప్రార్థించుచున్నాము.

— సంపాదకుడు.

# "గీతావాణి"

శ్రీ గీతాసాహిత్య సేవాసమితి పక్షమున ప్రకటింపబడు
గీతాతత్త్వ సందేశ మాసపత్రిక.



మేనేజింగ్ ఎడిటర్:

[illegible]

మేనేజర్:

[illegible]

గీతావాణి. ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.

సంవత్సరచందా 4-0-0. ❋ విడి పత్రిక 0-6-0

15th AUGUST 1954.

## కృష్ణార్జున సంవాదము.

మనలోని సుగుణములే పాండవులు. దుర్గుణములే కౌరవులు. చెడు తలంపులే కౌరవసైన్యము. మంచితలంపులే పాండవపక్ష సైన్యము. జీవుఁడే అర్జునుఁడు. దేవుఁడే కృష్ణపరమాత్మ. కనుక కృష్ణార్జున సంవాదమే జీవాత్మ పరమాత్మ సంవాదముగాను కురుక్షేత్ర యుద్ధమే హృదయ క్షేత్రమున అరిషడ్వర్గాదులగు దుష్టులకును, సత్యము శాంతము దమము శమము మున్నగు శిష్టులకున్ను నిరంతము జరుగుచుండు యుద్ధముగను కృష్ణపరమాత్మయొక్క గీతామృతోపదేశమే జీవాత్మ పరమాత్మలయొక్క స్వరూప నిరూపణముగను జీవాత్మ పరమాత్మల వియోగాంతమును సంయోగ ప్రాప్తియు స్వధర్మనిర్వహణము మూలముగనే జరుగవలెననియు భావించి భగవద్గీతను పఠింపవలెను.

## కురుక్షేత్రము.

ఈస్థలము సరస్వతీ, దృశద్వతీనదుల మధ్య నలుబదిమైళ్ళ పొడవును వెడల్పును గలిగి యుండునట్లు వర్ణింపఁబడినది. ప్రస్తుతము పంజాబులోని అంబాలాకును ఢిల్లీకిని మధ్యనుండినట్లు నిర్ణయింపవచ్చును. అచ్చట నేటికిని కురుక్షేత్రమను చిన్న పట్టణము గలదు. ఇచ్చట పూర్వము బ్రహ్మ, అగ్ని, ఇంద్రుడు తపస్సుచేసినందున ధర్మక్షేత్రమనియు, కురుమహారాజు పాలించినందున కురుక్షేత్రమనియువ్యవహరింపఁబడినది. క్షేత్రమనగా పంటభూమి. ధర్మక్షేత్రమనిన కొంచెము ధర్మమచ్చట చేసినను గొప్ప ఫలమిచ్చు ప్రదేశమనియుఁ జెప్పనొప్పును. ధర్మక్షేత్రమనునది మన శరీర మను కొందము. ధర్మమే భగవత్స్వరూపము. అట్టి భగవంతుఁడంతర్యామిగనుండుటచే భగవంతుఁడు నియమించిన ధర్మనిర్వహణమున కియ్యది క్షేత్రము వంటిదే. దీని నుపయోగించి భగవదాజ్ఞయని నమ్మి భగవత్ప్రీత్యర్థము చేయుకార్యము లన్నియు మోక్షప్రదములే.

వంగీపురం రంగస్వామి అయ్యంగారు,
పాకాల, చిత్తూరుజిల్లా.

## గీతామృత బిందువు.

తటస్థభావాన్ని కోల్పోక స్వధర్మ ప్రాప్తమైన కర్తవ్యాన్ని ఆచరించుట కర్మయోగానికి ముఖ్య కీలకం.



సంపుటి 4 * స్వస్తిశ్రీ జయ – శ్రావణమ్. * సంచిక 2

# శ్రీ కృష్ణః శరణం మమ

జీవితములో మానవునకు ఒకప్పుడు కానిచో మరొకప్పుడు విషాద సంఘటనలు యెదుర్కొనక పోవు. సామాన్యముగ మనుష్యునియంధు స్థితిమాంద్యము మెండు. పాలిటబడిన ఏదో ఒక పరిస్థితియందు అట్లే పడియుండుట వానికి యిష్టము. అది వానియందలి తమోగుణ పరిణామము. భగవంతుని యీ సృష్టియందు 'వికాసశక్తి' గూఢముగ దాగి పనిచేయుచున్నది. మనుష్యుడు ఒకే పరిస్థితియందు పడియుండుటకది సమ్మతించదు. అసలే జగత్తు గతి శీలమైనది. 'గచ్ఛతి ఇతి జగత్' నదీప్రవాహమువలె జరిగిపోవునది – జారిపోవునది; కావున దీనికి సంసారమని పేరు. సేన నడచునపుడు, అందలి ఒక సైనికుడు అలసియుకూడ తాను నిలబడుటకు వీలులేదు. నిలబడినచో వెనుకనుండి దెబ్బతినక తప్పదు. అట్లే నిరంతర గతిశీలమగు జగత్తులో జీవుడు తన గమనమును మేళ

వించి నడువదగును. అట్లుగాక యెవడైనను తమోగుణమున బడి స్తబ్ధగతియైయున్నచో, భగవంతుని మహాకాలశక్తి వాని జీవితము నందు పునర్వ్యవస్థ సమకూర్చుటకు వానినొక్క తన్నుతన్ని హెచ్చరించి మార్గమునకు తెచ్చును. కాబట్టియే, జీవితమునందు విషాదము ఆవశ్యకమైన వస్తువైనది.

విషాదమున జీవిత ప్రవాహము క్రొత్తవంపు (మలుపు) తిరుగుటకు వీలున్నది. కాన భగవద్గీత విషాదయోగముతోడనె ప్రారంభమైనది. విషాదయోగమైన పిమ్మటనే కర్మయోగము - భక్తియోగము - ధ్యానయోగము - జ్ఞానయోగము అన్నియు వచ్చినవి. విషాదయోగికానివాడు కర్మయోగికాలేడు; భక్తియోగికాలేడు; ధ్యానయోగికాలేడు; జ్ఞానయోగికాలేడు. కాని, విషాదపరిస్థితియందు జీవితరథము వొడుదుడుకులులేక శ్రేయఃపథమున సాగవలెననిన శ్రీకృష్ణుని సారథ్యము కావలెను. ఆ దేవుని సహాయము కావలెను. అట్లుగాక; అజ్ఞాన సారథ్యము - అహంకార సారథ్యము యొడగూడినచో విషాదమునుండి మరింత విషాదమునకు జారిజారి మానవజీవుడు అధఃపతనమునకు - ఆత్మహత్యకుకూడ పాల్పడ వచ్చును.

మానవ జీవితాకాశమున నేడు విషాదమేఘము లలముకొన్నవి. యుద్ధమువలన యుద్ధసంకటమును నివారింపవచ్చునని, శాంతి భద్రతలనుకాపాడవచ్చునని లోకనాయకులుద్ఘాటించుచున్నారు. ఆ పలుకులలో నిజమగుపడుట లేదు. ఆంగ్లరాజ్యము తొలగినచో భారతదేశమున రామరాజ్యమేర్పడునని ప్రముఖులు కలలుగనిరి. ఆ కలలు కలలుగనె యున్నవి. ఒకవైపు నిరుద్యోగసమస్య. ఒకవంక వస్తువులకు విపరీతమైనధరలు. కరువులు - కాటక

ములు. సమ్మెలు – సత్యాగ్రహములు. ప్రజాకోటియందు పరస్పర వైమనస్యము. అశాంతి. అతృప్తి. ఎచ్చటచూచినను ఉత్సాహముద్ర లేదు; ఉల్లాసరేఖ లేదు. మొత్తము నరమానవలోకమే విషాదక్షేత్రమున దిగినది. "భారతవీరా! పిరికితనము మాని యుద్ధమునకు లేలె"మ్మని ఉత్సాహగీతమాలాపించి యీ ఉపద్రవమునుండి ఉద్ధరించుటకు ప్రస్తుతము శ్రీకృష్ణుడు కావలెను. మరి, ఆ కృష్ణుడెచ్చటో లేడు. సర్వభూతముల హృద్దేశమున ఆయన సదాసర్వదా ఉండనేవున్నాడు. కాని, "శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నం"అని ఆయనను శరణుబొందెడి సద్బుద్ధి మానవలోకమునకు కావలసియున్నది. "శ్రీకృష్ణుడు నావాడు; ఆయన నా ప్రభువు; నన్నవశ్యముద్ధరింపగల"డనెడి సజీవశ్రద్ధ ప్రతిమానవుని హృదయరంగమున పడగెత్తి ఆడవలసియున్నది. గజేంద్రుని రక్షించిన – ద్రౌపదిని కాపాడిన – ప్రభువు, ఆర్తుల నుద్ధరించుటకు నిత్యనిరంతరము సిద్ధమైయున్నాడు. ద్వంద్వసంకులమయమగు జీవితమున ధర్మసమ్మూఢచేతస్కుడై విషాదమునకు గుఱియైన నరునకు యేది శరణ్యము? అయిదువేల సంవత్సరముల నాడు అర్జునుడుచ్చరించిన మహామంత్రమె శరణ్యము.

"బుద్ధిర్మే కుంఠితా దేవ!
సమాప్తా మమ యుక్తయః।
నాన్యత్కించిద్విజానామి
త్వమేవ శరణం మమ" ॥ *

* తా॥ నాబుద్ధి కుంఠితమైనది. నా యుక్తులు తుక్కుబోయినవి. మరేమి యెఱుంగను. ఓ కృష్ణదేవా! నీవే నాకు శరణు.




(గతసంచిక 10_వ పుట తరువాయి.)

"ఓ కుంతీతనయా! లోకమందలి జనసముదాయమును ముఖ్యముగ నాల్గువిధముల విభజింపవచ్చును. దుఃఖముతో పీడింపబడియుండు ఆర్తుడొకడు, ధన పుత్ర కళత్ర సంపదారోగ్యములను పడయగోరెడి అర్థార్థి యొకడు, ఆత్మను తెలిసికొనవలెనని అపేక్షగల జిజ్ఞాసువొకడు, తత్త్వవేత్తయగు జ్ఞానియొకడు యీ విధమున సర్వకర్మ ఫలప్రదాతను, సర్వేశ్వరుడనునగునన్ను సకామబుద్ధితోకాని నిష్కామబుద్ధితోకాని భజించెడివారు, పైచెప్పిన నాల్గువిధములలో నెవ్వరైన నగుదురుగాక; వారివారి వాంఛిత ఫలములనిచ్చి వారి ననుగ్రహింతును; అంతె కాని వారి కోర్కెలకు విపరీతముగ ఫలములనిచ్చుటలేదు. వారిలో మొదటివాడగు ఆర్తభక్తుడు కేవలము సాంసారికదుఃఖనివృత్తికై నన్ను భజించును. వానికి మోక్షాపేక్షలేదు. వానికిగల ఆదుఃఖమును నేను నివారణచేయుదును. అట్లే మోక్షాపేక్షలేని అర్థార్థి భక్తులకు గూడ వారుకోరు ధనాదులనొసగి అనుగ్రహింతును. నిష్కామ కర్మ



ముల నాచరించుచుండెడి జిజ్ఞాసు భక్తులకు ఆత్మజ్ఞానమును దయచేసి వారిని రక్షింతును. తత్త్వమునెఱింగిన జ్ఞానికి మోక్షమును ప్రసాదింతును.

భక్తులొక్కటి కోరిన మరొక్కటి యిచ్చుట నా పద్ధతికాదు. వారి వారి భావనానుకూలముగ ఫలములిచ్చుటే నావని. నాయందు

వైషమ్యము, నిర్దయత అను రెండు దోషములు సంభవింపవు."

భగవంతుడు చెప్పిన ఈ విషయము నొక్క ఉదాహరణముతో స్పష్టము చేయుదును. ఒకానొక బాటసారి యెందో పోవుచు, యెండకు తపించి మధ్యాహ్న సమయమున నొక చెట్టు నీడయందు పోయి కూర్చుండెను. తలవని తలంపుగా వాడు ఆశ్రయించిన చెట్టు కల్పవృక్షమైయుండెను. కాని ఆవిషయము వానికి తెలియదు. కొంతసేపటికివాని బడలిక శాంతించినది. దప్పితోచినది. "ఆహా! ఈ చోటనీరున్నచో యెంత బాగు!" అని వాడు తలంచెను. తలంచుటే తడవుగా నీరు సిద్ధముగ తోచినది. నీరుత్రాగి దాహమార్చుకొని నంతట రెపరెపమని ఆకలితట్టినది. "ఈశ్వరా! వట్టినీటితో ఏమి లాభము? ఏదైన కొంత ఆహారమున్నచో దానినితిని తృప్తిబొందుదునుగదా!" అని తలంచెను. కల్పవృక్షప్రభావముతో అన్నముకూడ సిద్ధమైనది. తుష్టిగా ఆహారమును మెసవి భుక్తాయాసముతో కూడి, కొంతసేపు శరీరమును నేలపై వాల్చుటకు మెత్తని పరుపును స్మరించెను. అదియు సిద్ధము. పరుపుపై సుఖముగ పరుండిన వానిచిత్తమున పెండ్లాము జ్ఞప్తికి వచ్చినది. తలంచినంతనె పెండ్లాము దగ్గర అగపడినది. వాడు కంగారుపడి, "ఔరా! యిదేమి? ఇచ్చటికి నా భార్యయెట్లు రాగల్గును? ఇది దయ్యమేమో!" అని అనుకొనెను. అంతటిలో అది దయ్యమైనది. "అయ్యో! ఈ దయ్యము నన్ను తినివేయునో!" అని తలంచెను. అది ఆ బాటసారిని తినివేసినది. ఇచ్చట తప్పెవ్వరిది? ద్వేషవైషమ్యములను కల్పవృక్షమునకు అంటగట్టవచ్చునా? ఈ విధముగనె, వారి వారి భావనలననుసరించి ఫలముల నొసగెడి భగవంతునియందు ద్వేషవైషమ్యముల నారోపింపరాదు.

ఎవ్వడే ఉద్దేశ్యముతో భగవంతుని శరణుబొందునో, వాని ఆ ఉద్దేశ్యముననుసరించియే భగవంతుడనుగ్రహించగలడు. ఆర్తుని ఆర్తి నెడబాపగలడు. అర్థార్థి యొక్క యిష్టార్థము నొసగగలడు. ముముక్షువునకు మోక్షము నొసగగలడు. జ్ఞానికి మోక్షమివ్వగలడు. లోకసేవకునకు యోగ్యసామర్థ్యమును దయచేయగలడు. ఇట్లు జ్ఞానమువలన జ్ఞానియు,కర్మవలన కర్మియు, ప్రేమవలన ప్రేమియు భగవంతుని మార్గమునె అనుసరించుచున్నారు.

సమస్త ఫలములును భగవంతునినుండి జనులకు లభించుచున్నచో, అందరును భగవంతుని అనుసరించి జన్మసార్థక్య మెందుకు చేసికొనుటలేదు? అను శంకకు రాబోవు శ్లోకమునందు సమాధానము చెప్పుచున్నారు.

"ఓ కిరీటీ! నేను సర్వఫలముల నిచ్చువాడనై నను - సర్వఫల ప్రతిష్ఠాతనై యున్నను, సామాన్యజనులు తమ ఆత్మస్వరూపుడనై యున్న నన్ను పాసించుటమాని యితర దేవతలను సేవింతురు. కారణమేమనిన- జ్ఞానమువలన సిద్ధిలభించుట ఆలస్యము. కర్మవలనకల్గు సిద్ధులు శీఘ్రముగ చేకూరును. అంతేగాక, కర్మసిద్ధి ప్రత్యక్షముగ గోచరించును. జ్ఞానజన్యసిద్ధి ప్రత్యక్షముగ గోచరింపదు. మరొక్క కారణముకూడ గలదు. కర్మము స్థూల శరీరమునకును - యింద్రియములకును యెక్కువ సంబంధించి యుండును. జ్ఞానముయొక్క సంబంధము సూక్ష్మ శరీరమునకును - అంతఃకరణమునకును చెందియుండును. కాబట్టి చూచువారికి బాహ్య కర్మఫలము ప్రత్యక్షముగ గోచరించును. జ్ఞానఫలము ఆ విధముగ గోచరింపక వారివారి అంతఃకరణమునందే అనుభవమునకు వచ్చును. మరియు, సామాన్యజనులు స్థూలశరీరముతో గాఢమగు సంబంధము కలవారు కాబట్టి వారు బహుశా కామనాసక్తులయ్యే ఉందురు. విచారనిష్ఠ గలవారు మిక్కిలి తక్కువ. అట్లు కామనాగ్రస్తులై యుండువారు, ఆయా యింద్రియములకు సంబంధించిన విషయభోగములందు అపేక్ష కల్గియుండువారు కాబట్టి, వారి యిష్ట సిద్ధికై ఆయా యింద్రియాధిష్ఠాన దేవతల నుపాసింతురు. అట్టివారు రాత్రింబవలు స్థూలశరీరమును పుష్టీకరించుటయందే తత్పరులై యుందురు; కాని, తమ స్వరూపభూతుడగు ఆత్మదేవునియెడ దృష్టియె యుండదు. ఆత్మికమగు పుష్టిని వారు కోరుటలేదు. వారు చేయు దేహేంద్రియ ఉపాసనకూడ నాకు చెందినదెయయ్యు-అది సరలమగు రీతికాదు; వక్రరీతి."

భగవంతుడు లోగడ 'తాను ధర్మసంస్థాపనార్థముగ అవతరించుచున్నా'నని చెప్పియుండెను. ఆధర్మ సుస్థాపనము కొఱకు భగవంతుడనుసరించిన వ్యవస్థావిధానమును రాబోవు 13-వ శ్లోకమునందు పేర్కొనుచున్నాడు. (సశేషము.)

# శ్రీకృష్ణావతారము.

-శ్రీరామశరణ్ - కుందుర్తి వేంకటనరసయ్యగారు-

సంపాదకుడు: "మోక్షసాధని"

[ప్రపంచములో శ్రీరామనామానికి శ్రీకృష్ణనామానికి గల పలుకుబడి మరి యే పేరుకుకూడ లేదు. శ్రీకృష్ణజయంతి సంచికయందు అవశ్యము భూషణప్రాయముగనుండు 'శ్రీకృష్ణ' శబ్ద వ్యాఖ్యానరూపముగు వ్యాసమును, అడిగినంతనె వ్రాసిపంపిన వ్యాసకర్త గారికి మా కృతజ్ఞతా ధన్యవాదములు. — సం॥]

పరమాత్మ నిర్గుణ, నిరంజన, నిరాఖ్యాత, నిర్వికార, నిత్య, సత్య, బుద్ధస్వరూపుఁడయ్యు నొకానొక కార్యమును నెఱవేర్చుటకు దారువులోని అగ్నివలె ప్రకటితమై అధర్మమును నశింపఁజేసి ధర్మమును స్థాపించును. ఈ విషయమును శ్రీకృష్ణ పరమాత్మ గీతావాణిలో నిటివల నిట్లే చెప్పియున్నాఁడు. గీత సగుణసాకార వాదమును సమర్థించుచున్నది.



శ్లో॥ యదా యదా హి ధర్మస్య

గ్లానిర్భవతి భారత ।

అభ్యుత్థానమధర్మస్య

తదాత్మానం సృజామ్యహమ్॥

॥గీత॥

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం

వినాశాయ చ దుష్కృతాం।

ధర్మసంస్థాపనార్థాయ

సంభవామి యుగే యుగే॥

॥గీత॥

ఎప్పుడెప్పుడు ధర్మమునకు హానికలుగునో, అధర్మము పెచ్చుపెరుగునో అప్పుడు నేను నన్ను సృజించుకొందును. సాధువులను రక్షించుటకును, దుర్మార్గులను వినాశము కావించుటకును, ధర్మమును స్థాపించుటకును నేను యుగయుగమునను బుట్టెదను.

గీతలో శ్రీకృష్ణుఁడిట్లు చెప్పుటచే శ్రీకృష్ణుఁడు సాక్షాత్పరాత్పరావతారమని తెలియుచున్నది. అవతారములు అంశ, అంశాంశ, ఆవేశ, కళా, పూర్ణములని అయిదు రకములు. కపిలవ్యాసాదులు అంశావతారములు, పరశురాముఁడు ఆవేశావతారము, మత్స్యకూర్మాది అవతారములు కళావతారములు,

"నృసింహ రామకృష్ణేషు షాడ్గుణ్యం పరి పూరితమ్మని చెప్పుటచే నృసింహ, రామ, కృష్ణావతారములు పూర్ణములు. గర్గసంహిత ననుసరించి శ్రీకృష్ణావతారము పూర్ణమే కాదు పరిపూర్ణావతారమని చెప్పఁబడినది.

శ్లో॥ అంశాంశాంశ స్తథాఽఽవేశః
కలా పూర్ణః ప్రకథ్యతే।
వ్యాసాద్యైశ్చ స్మృతః కృష్ణః
పరిపూర్ణతమః స్వయమ్॥

అంశ, అంశాంశ, ఆవేశ, కలా, పూర్ణ ములని అవతారము లైదురకములు గలవు. వ్యాసాదులిట్టివారు. కృష్ణుఁడు పరిపూర్ణ తముఁడు.

శ్లో॥ కకారః కమలాకాంత
ఋకారో రామ ఇత్యపి।
షకారః షడ్గుణపతిః
శ్వేతద్వీపనివాసకృత్ ॥

,, ణకారో నారసింహోఽయ
మకారో హ్యక్షరోఽగ్నిభుక్।
విసర్గౌ చ తథా హ్యేతౌ
నరనారాయణావృషీ॥

,, సంప్రలీనాశ్చ షట్పూర్ణా
యస్మిన్ శబ్దే మహామునే।
పరిపూర్ణతమే సాక్షా
త్తేనకృష్ణః ప్రకీర్తితః॥

'కృష్ణః' అను శబ్దములో కకారము లక్ష్మీకాంతుఁడైన నారాయణుఁడు, ఋకారము శ్రీరాముఁడు, షకారము షడ్గుణ (సమగ్రమగు ఐశ్వర్యము, ధర్మము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము) పతియు శ్వేతద్వీపవాసియునగు భూమాపురుషుఁడు, ణకారము నరసింహుఁడు, అకారము ఆదిశేషుఁడు, విసర్గ నరనారాయణులు ఈ ఆఱు పూర్ణావతారములు. ఇవి యేశబ్దములో లీనమగునో అది పరిపూర్ణావతారము. అది పరిపూర్ణతమమగు నవతారము కావున 'కృష్ణః' అని పేరువచ్చినది.

కృష్ణ శబ్దమును గూర్చి వేఱొకచోట నిట్లు చెప్పఁబడినది:—

శ్లో॥ బ్రహ్మణో వాచకః కోఽయ
మృకారోఽనంతవాచకః
శివస్య వాచకః షశ్చ
నకారో ధర్మవాచకః॥

,, అకారో విష్ణువచనః
శ్వేతద్వీపనివాసినః।
నరనారాయణార్థస్య
విసర్గో వాచకః స్మృతః॥

,, సర్వేషాం తేజసాం రాశిః
సర్వమూర్తిస్వరూపకః।
సర్వాధారస్సర్వబీజ
స్తేనకృష్ణ ఇతిస్మృతః॥

కకారము బ్రహ్మవాచకము. ఋకారమనంతవాచకము, షకారము శివవాచకము, నకారము ధర్మవాచకము, అకారము క్షీరసాగరవాసియగు విష్ణువాచకము, విసర్గ నరనారాయణార్థకము, సర్వతేజోరాశియు, సర్వమూర్తి స్వరూపకుఁడును, సర్వాధారుఁడును, సమస్తమునకు బీజమైనవాఁడు కృష్ణుఁడనఁబడును.

శ్లో॥ కర్మనిర్మూలవచనః
కృషిర్ణో దాస్యవాచకః।
అకారో దాతృవచన
స్తేన కృష్ణ ఇతి స్మృతః॥

'కృషి' కర్మనిర్మూలక శబ్దము, 'ణ' కారము దాస్యవాచకము, 'అ' కారము దాతృవాచకము. కావున కృష్ణుఁడైనాఁడు. అనఁగా కృష్ణుఁడు కర్మ నిర్మూలనము చేయును.

శ్లో॥ కృషిర్నిశ్చేష్టవచనో
నకారో భక్తివాచకః।
అకారః ప్రాప్తివచనః
తేన కృష్ణ ఇతి స్మృతః॥

'కృషి' నిశ్చేష్ట వాచకము, నకారము భక్తివాచకము, అకారము ప్రాప్తివాచకము అందువలన కృష్ణుఁడని పిలువఁబడుచున్నాఁడు. అనగా కేవల భక్తి నొసంగును.

శ్లో॥ కృషిర్నిర్వాణవచనో
నకారో మోక్షవాచకః।
అకారో దాతృవచన స్తేన
కృష్ణ ఇతిస్మృతః॥

'కృషి' నిర్వాణవాచకము అనఁగా అఖండవాచకము. నకారము మోక్షవాచకము. అకారము దాతృవాచకము. అందువలనఁ గృష్ణుఁడని పిలువఁబడుచున్నాడు. అనఁగా కృష్ణనామము పలుకుటచే అఖండమోక్షము ప్రాప్తించుచున్నది.

శ్లో॥ కృషిరుత్కృష్టవచనో
ణశ్చ సద్భక్తివాచకః।
అశ్చాపి దాతృవచనః
కృష్ణం తేన విదుర్బుధాః॥

'కృషి' ఉత్కృష్టవచనము, 'ణ' కారము సద్భక్తి వాచకము. 'అ' కారము దాతృవచనము కావునఁ గృష్ణుఁడని పెద్దలు చెప్పుదురు. అనఁగా 'కృష్ణ' అని పలికిన నుత్కృష్టమగు భక్తి లభించును.

శ్లో॥ కృషిశ్చ పరమానందే
ణశ్చ తద్దాస్యకర్మణి।
తయోర్దాతా చ యో దేవ
స్తేన కృష్ణః ప్రకీర్తితః॥

'కృషి' పరమానందము, ణకారము దానికి దాస్యకర్మము, అట్టిపరమానంద దాసత్వము నొసంగువాఁడు కృష్ణుఁడనఁబడుచున్నాఁడు.

శ్లో॥ కోటిజన్మార్జితే పాపే
కృషిః క్లేశే చ వర్తతే।
భక్తానాం యశ్చ నిర్వాణే
తేన కృష్ణః ప్రకీర్తితః॥

'కృషి' శబ్దములో కోటిజన్మలలో సంపాదించిన పాపమును, క్లేశమును గలదు. 'ణ' కారముచే భక్తులను దానినుండి రక్షించును కావున కృష్ణుఁడని పిలువఁబడుచున్నాడు.

శ్లో॥ కృషిర్భూవాచకో ణశ్చ
పరమానందవాచకః।
సదానంద స్తతః కృష్ణః
ప్రోచ్యతే పురుషోత్తమః॥

'కృషి' భూవాచకము. 'ణ' కారము పరమానందవాచకము. సదానందవాచకుఁడగు పురుషోత్తముని కృష్ణుఁడనుచున్నారు.

ఇన్ని లక్షణములు గల శ్రీకృష్ణుఁడు సాక్షాత్పరంబ్రహ్మ. బ్రహ్మసూత్రములలో

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అని చెప్పఁబడిన బ్రహ్మ శ్రీ కృష్ణుఁడే. నిర్గుణబ్రహ్మ సగుణబ్రహ్మగ వ్యక్తమైనపుడు హ్లాదినీశక్తియగు రాధికాదేవితోఁగూడ అవతరించును. అనఁగా తానే రెండుగనగును. అక్షర సాంఖ్యము ననుసరించి అచ్చులు వేఱుగ, హల్లులు వేఱుగ లెక్కించుచో "బ్రహ్మ" శబ్దమున కెన్ని వచ్చునో చూతము. బ్రహ్మ శబ్దములో బ, ర, హ, మ అక్షరములు కలవు. బ = 23; ర = 27; హ = 33; మ = 25. మొత్తము 108 అయినది. అనఁగా బ్రహ్మసంఖ్య 108. అందుకనియే 108 జపము, 108 పూజ చేయుట. ఆ బ్రహ్మయే "రాధికా + కృష్ణ" అయిరి. మూర్తిలో సగము స్త్రీ, సగము పురుషుఁడు కావున 54 + 54 = 108 కావలెను. చూడుఁడు. "రాధికా" శబ్దములో ర + అ + ధ + ఇ + క + అ కలవు. వీని సంఖ్యలను గూడినచో, ర = 27 + అ = 2 + ధ = 19 + ఇ = 3 + క = 1 + అ = 2 = 54 అయినది. ఇఁకఁ గృష్ణశబ్దమును జూడుఁడు. కృష్ణశబ్దములో క + ఋ + ష + ణ అక్షరములు కలవు. క = 1 + ఋ = 7 + ష = 31 + ణ = 15 = 54. రాధికా = 54 + కృష్ణ = 54 = 108. బ్రహ్మ శబ్దమునకు సరిపోయినది.

జాగ్రత్స్వప్న సుషుప్తుల కావలనున్న తురీయస్వరూపుఁడు శ్రీకృష్ణుఁడు ప్రణవములో అకారము విశ్వుఁడు (జాగ్రత్తు) ఉకారము తైజసుఁడు (స్వప్నము). మకారము ప్రాజ్ఞుఁడు (సుషుప్తి) "ఁ" అర్ధమాత్ర (తురీయము) పరమాత్మ.

శ్రు॥ ఏకమేవాద్వయం బ్రహ్మ మాయయా చ చతుష్టయమ్। రోహిణీతనయో విశ్వ అకారాక్షరసంభవః। తైజసాత్మకః ప్రద్యుమ్న ఉకారాక్షర సంభవః। ప్రాజ్ఞాత్మకోఽనిరుద్ధోఽసౌ మకారాక్షరసంభవః। అర్ధమాత్రాత్మకః కృష్ణో యస్మిన్విశ్వం ప్రతిష్ఠితమ్॥

గోపాలోత్తరతాపిన్యుపనిషత్.

ఒకే అద్వయపరంబ్రహ్మ మాయవలన నలుగురుగ నయ్యెను. రోహిణీతనయుఁడగు బలరాముఁడు విశ్వసంజ్ఞుఁడై అకారము వలన నయ్యెను. ప్రద్యుమ్నుఁడు తైజసాత్మకుఁడై ఉకారమువలన నయ్యెను. అనిరుద్ధుఁడు ప్రాజ్ఞుఁడై మకారమువలననయ్యెను. కేవల తురీయస్వరూపుఁడగు కృష్ణుఁడు అర్ధమాత్రవలన నయ్యెను. కావున శ్రీకృష్ణుఁడు పరబ్రహ్మ.

శ్రీ కృష్ణావతారము వచ్చుటకు మన పురాణములలో ననేక కారణములు చెప్పఁబడినవి. కృష్ణోపనిషత్తు ననుసరించి త్రేతాయుగములో శ్రీ రామచంద్రుని ఋషులు కౌఁగిలింపఁదలంపఁగాఁ దాను ఏకపత్నీవ్రతస్థుఁడగుటచేఁ గృష్ణావతారములో నా కోర్కె తీర్చెదననెను. అప్పుడు వారు భార్యలైరి. ఇదియొక గాథ. బ్రహ్మతలను శివుఁడు తెగఁగొట్టుటచే శివునకు బ్రహ్మహత్యాదోషమాపాదింపబడెను. ఆదోషము పోవుటకు కపాలముతో భిక్షమెత్తుకొనుచుండ వైకుంఠములో విష్ణువులేని సమయమున లక్ష్మీదేవి గడపకు అవల నొక కాలు, ఈవల నొక కాలునుంచి భిక్షపెట్టఁగా నా బ్రహ్మహత్యాదోషము లక్ష్మికాపాదిం

చేను. ఆమె బ్రహ్మహత్యా పోవుటకై ఆది శక్తికి 18 అక్షౌణీ నరబలి నొసంగెదనని మ్రొక్కుకొనఁగా శక్తి ద్రౌపది యయ్యెనఁట. శ్రీకృష్ణుఁడామెకు భారతయుద్ధమందు రెండుపక్షములలోని 18 అక్షౌణీ సేనను బలియిచ్చెనఁట.

ఇంకొక గాథననుసరించి గోలోకాధిపతియగు శ్రీ కృష్ణుఁడు తన నిత్యప్రేమ లీలలను లోకమునఁ జేయుటకై పరివారముతోడను, సర్వోపనిషత్తులు, వేదములు, దేవతలు, నిత్యముక్తులు మొదలగువారితో వ్రజమున నవతరించి 13 సంవత్సరములు లీల నొనర్చెను.

ఇంకొక గాథననుసరించి నరనారాయణులు లోక సంరక్షణార్థము ద్వాపరాంతమున నవతరించి దుష్టశిక్షణ, శిష్టసంరక్షణము చేసి నరునకిచ్చిన మాటననుసరించి రణభూమిని సర్వోపనిషత్స్వరూపమగు భగవద్గీతావాణిని అర్జునుని నెపముగా నొనర్చుకొని సత్పురుష మానస క్షేత్రములఁ బ్రవహింపఁజేసి ఎన్నివిధములఁదన్ను దెలిసికొనుటకు, అనుభవించుటకు వీలుకలదో అన్నివిధములగు మార్గములను గీతలో నుపపాదించి సర్వోపరి జ్ఞాన భాండారమను ఖ్యాతిని లోకమునకు వెల్లడించి శ్రీ కృష్ణుని జన్మదినము శ్రావణ బహుళ అష్టమినాఁడు వచ్చినది. అట్టి యీపవిత్ర దినమును అందఱును మహోత్సవముగ గ్రహించెదరు గాక!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.



మనుష్యశరీరమున చూడవలసినంతటి సర్వజ్ఞతను శ్రీకృష్ణునియందు చూడవచ్చును. ఆతని కార్యకారి ప్రవృత్తులు చరమ సీమవరకు వికసించినవి. ఆయన సాహసము తీక్ష్ణమును కర్మతత్పరతను చాటిచెప్పును. అతని ధర్మనిష్ఠ గట్టిది. ఆతనికి ఓర్పు అపారము; అయినను సమయమునందు వజ్రకఠోర హృదయముతో దండనము విధించును. మానుషీశక్తితో పనిచేయుచున్నను, అతని చరిత్ర అమానుషము. శ్రీకృష్ణుడు దేవుడో మానవుడో, పాఠకుడు వానివాని బుద్ధిశక్తినిబట్టి నిర్ణయించుకొనవచ్చును.

— బాబూ బంకించంద్రఛటర్జీ.



# జనా క్షీర లోకాలు ★

రచయిత:— శ్రీ వసంతరావు వెంకటరావుగారు, విజయనగరం.

Head of the dept. of Physics, M. R. College
Editor: Telugu Encyclopedia Vol. IV.

*

[ " 'జనాక్షీర లోకాలు' లోనున్న విషయం ఆధ్యాత్మికానికి సంబంధించినదనీ, మానవుని అల్పత్వాన్నీ, జగత్ బృహత్వాన్నీ చూపి గీత సాధింపే ప్రయోజనాన్నే పై వ్యాసం సాధించగలదని నమ్మి పంపేను. ఆధునిక యువకులకు ప్రాచీనంపై విశ్వాసం తగ్గుతూన్న కారణంచేతను, సహేతుక వివరణను కాని వారంగీకరింపక పోవుటచేతను, మన ప్రాచీనాభిప్రాయాలనే భౌతిక విజ్ఞానదృష్ట్యా నివేదించినప్పుడు ఆ జ్ఞానాన్ని వారు తప్పక గ్రహిస్తారన్న విశ్వాసంతోను మీకు వ్యాసం పంపేను."— అని వ్యాసకర్త తమ ఉత్తరములో వ్రాసిన అభిప్రాయాన్ని ఆమోదిస్తూ — సాక్షాత్తుగా గీతాతత్త్వానికి సంబంధించకున్నా — వారి శ్రమకు సానుభూతిగ ప్రకటిస్తూన్నాము. — సం॥]

విజ్ఞానం, ఎంతవడిగా పురోగమిస్తున్నప్పటికి 'జీవోద్భవం ఎట్లు జరిగింది' అన్న ప్రశ్నకు ఇంతవరకు సమాధానం కనుగొనలేక పోయింది. జీవరహస్యం తన కింతవరకు తెలియలేదని భౌతికవిజ్ఞాని అంగీకరించేడు. పంచేంద్రియాలను అతీతమైన జ్ఞానాన్ని పెంపొందించుకొంటే జీవరహస్యం తెలిసికోవచ్చని వేదాంతులంటారు. వేదాంతి చూపిన మార్గాన్ని ఆశ్రయించినవారు సందేహాలతో బాధపడరు. కాని, భౌతిక విజ్ఞానమార్గాన పోతూన్నవారు ముందెప్పుడైనా జీవరహస్యం తెలిసికోగలమను ఆశతో గమిస్తుంటారు.

మానవునికి జ్ఞానోదయ మైనప్పటినుండి తన పరిసరాలను పరిశీలిస్తునే ఉన్నాడు. ఆకాశంలో మిన్కు-మిన్కుమని రాత్రిళ్లు



మెరసే నక్షత్రాలనుచూచి సంభ్రమాశ్చర్య చకితుడయేడు. కాని 2500 సంవత్సరాల

పూర్వం కొందరు భావోద్దీపితులు ప్రకృతి విషయాలను తీవ్రంగా యోచింప పూనుకొన్నారు. ఆకాశమూర్తులలో కొన్నిటి క్రమగమనాన్ని పరిశీలించి, మన భూమి, మరికొన్ని గ్రహాలతోసహా సూర్యునిచుట్టూ తిరుగుతూందన్నారు. మనం నివసిస్తూన్న భూమి ఆకాశంలో తిరుగుతూందంటే కొందరికి నచ్చింది కాదు. అందుచేత, సూర్యుడు గ్రహాలుకూడా స్థిరంగానున్న భూమిచుట్టూ తిరుగుతున్నాయని వారన్నారు. ఈ విధంగా సౌరకేంద్ర భూకేంద్ర సిద్ధాంతాలు రెండును కొన్ని శతాబ్దాలపాటు ప్రచారంలో నుండేవి. తుదకు, గ్రహాలకురాజు సూర్యుడేననీ, గ్రహాలన్నీ సూర్యునికి నిత్యప్రదక్షిణాలు చేస్తున్నాయని సహేతుకంగా రుజువయింది.

తనకు లభ్యమైన జ్ఞానంతో తృప్తిపడి సంతోషించే స్వభావంకాదు మానవుడిది. గ్రహాలు సూర్యునిచుట్టూ తిరుగుతున్నాయని నిశ్చయమైన తరువాత చాలా ప్రశ్నలు జనించేయి. ఈ గ్రహాలేవిధంగా పుట్టేయి? వాటి చరిత్ర ఎట్టిది? గ్రహాలన్నీ ఒకేవిధంగానుంటే మన భూమిలోనున్న జీవంవంటి జీవం ఇతర గ్రహాలలోనుందా? మనభూమిలోనైనా జీవం ఎట్లు జనించింది? వీటికి సమాధానాలు కనుగొందామని ఎంతో మంది విజ్ఞానులు ప్రయత్నించేరు, ప్రయత్నిస్తున్నారు.

సౌరకుటుంబం ఎట్లు పుట్టిందో నికరంగా చెప్పగలస్థితిలోలేము. మండుతూన్న సూర్యగోళంనుండి గ్రహాలు ఎట్లు విడినడ్డాయో వివరించడానికి అనేక ప్రయత్నాలు జరిగేయి. వాటిలో ఇంతవరకు కాస్త మేలుగానున్న వాదాన్ని సర్ జేమ్సుజీన్సు ప్రతిపాదించేడు. "ది స్టార్స్ ఇన్ దేర్ కోర్సెస్" అను పుస్తకంలో జీన్సు ఈ విధంగా తన వాదాన్ని వివరించేడు: కాలంలో 300 కోట్ల సంవత్సరాలు తిరోగమించి సూర్యుని చుట్టుప్రక్కల సంచారంచేస్తున్నామనుకొందాం. అయితే అప్పటింకా సంవత్సరాలు లేవు. ఏమంటే సూర్యునిచుట్టూ భూమి ఒక ప్రదక్షిణంచెయ్యడానికి పట్టు కాలాన్ని సంవత్సరమన్నాం. ఆ కాలంలో భూమేలేదు. మనం కాలంలో ఎంత తిరోగమించేమంటే అప్పటికి మానవుడు భూమిపై కాలూనలేదు సరికదా, మానవున కాశ్రయమివ్వడానికి భూమేలేదు.

200 కోట్లు 300 కోట్లు సంవత్సరాల మధ్యకాలంలో సూర్యునికి సమీపంలో సంచరిస్తూ ఆకాశదృశ్యాలను చూస్తూంటే ఔజ్జ్వల్యంతో విపరీతంగా పెరుగుతూన్న ఒకనక్షత్రం కనిపిస్తుంది. అది దగ్గరగా వస్తూండడంవల్లనే దానిదీప్తి ఎక్కువౌతూన్నట్లు కనిపిస్తుంది. సూర్యుని ఢీకొనడానికి వస్తూందా అనిపిస్తుంది. అదొక వెలుగుచుక్క కాదు; పెద్దవెలుగు పెనంవలె గోచరిస్తుంది. సూర్యుని కెంత సమీపానికి వచ్చిందంటే అప్పుడే దాని ప్రభావం సూర్యునిపై చూపకలుగుతూంది. మనకతిదగ్గరగానున్న చంద్రుడేనేవిధంగా మన సముద్రాలలో కెరటాల నుప్పతిల్ల చేస్తున్నాడో, అదేవిధంగానే చంద్రుని కెన్నోరెట్లున్న ఈ నక్షత్రం మండుతున్న

సూర్యద్రవ్యంలో కెరటాలను కలిగిస్తూంది. సూర్యునిలో కలుగు కెరటాలు విపరీతమైనవి. నక్షత్రానికి క్రిందనున్న సూర్యతలంలో కొన్ని వేలమైళ్ళు ఎత్తుగల కొండవలె ద్రవ్యం ఉబికింది. నక్షత్రం తన మార్గాన్న పోతూంటే నక్షత్రంవైపే ఈ ద్రవ్య కెరటం పెరుగుతూంది. ఆకాశంలో సగానికి పైగా ఆక్రమిస్తూన్న నక్షత్రం సూర్యునిలో కెరటాన్ని పైకిలాగుతున్నప్పటికి సూర్యుని ఆకర్షణబలం ఎక్కువగా నుండబట్టి ఆ కెరటం సూర్యునిలోనేఉంది. కాని, నక్షత్రం మరికొంతదగ్గరకు రాగానే ఆ కెరటం నక్షత్రంవైపు గెంతడానికి ప్రయత్నిస్తుంది; మహావేగంతో నక్షత్రముఖంగా పరుగెత్తుతుంది. దానితో ద్రవ్య ప్రవాహం సూర్యునినుండి నక్షత్రంవైపు ప్రవహిస్తుంది. నక్షత్రం సూర్యునివైపు వస్తూంటే కొంతకాలానికా ద్రవ్య ప్రవాహం నక్షత్రాన్ని చేరుకొని సూర్యునితో నక్షత్రాన్నికలిపి ఉంచేదే.

కాని, ఆ నక్షత్రం సూర్యుని డీకొనక, సూర్యుని దగ్గరగావచ్చి వెనుతిరిగి పోమొదలుపెట్టింది. సూర్యునినుండి దూరంగా పోతూన్న కొద్దీ దాని ప్రభావం క్షీణించి సూర్య ద్రవ్యాన్ని లాగలేక పోయింది. అందుచేత, అంతవరకు పైకివచ్చిన ద్రవ్యం పొగచుట్ట ఆకారంలో, మధ్య లావుగాను కొనలు సన్నంగాను, లాగబడి ఆకాశంలో నిలిచిపోయింది. ఆ పొగచుట్టలో సూర్యునికి దూరంగానున్న కొన తొలిసారిగా పైకుబికిన కెరటందొక్క శిఖరం. నక్షత్రం సమీపతమంగా నున్నప్పుడు పుష్కలంగా పైకివచ్చిన ద్రవ్యం పొగచుట్ట మధ్యభాగమైంది. సూర్యునికి దగ్గరగానున్న కొన ఈ ప్రక్రియ అంతంలో సూర్యునినుండి వెడలినభాగం.

తప్త వాయువుగానున్న ఈ ద్రవ్య భాగాన్ని చూస్తూంటే అది చల్లారుతుంది. చల్లారుతూ, మేఘం నీటికణాలక్రింద ద్రవీభవించునట్లే ఆ ద్రవ్యంకూడా పెద్ద గోళాలుగా ద్రవీభవిస్తుంది. అయితే, ఆ పొగచుట్టవలెనే ద్రవ్యగోళాలుకూడా చాల పెద్దవి. వాటిలో మధ్యనున్నవి సహజంగా మరీపెద్దవి; కొనలనున్నవి చాల చిన్నవి.

ఈ విధంగా సాంద్రీకరించిన ద్రవ్య గోళాలు, కొంతకాలానికి ఆకాశంలో తిరగడానికి మొదలిడుతాయి. సూర్యుని నుండి పైకూడా పెరకి, తనదారిని తను పోతూన్న నక్షత్రం వీటికి చలనం కలిగించింది. నేరుగా సూర్యుని వైపు పోతూంటేతప్ప, అవి సూర్యునిచుట్టు పరిభ్రమిస్తాయి. ద్రవ్యం జనించినప్పటినుండి అణువులలోనున్న గురుత్వాకర్షణ సిద్ధాంతం యొక్క ఫలితమే అది. ఈ గోళాలు తిరుగుతూన్న కక్ష్యలలో కొన్ని వర్తులాకారంగాను, కొన్ని దీర్ఘవృత్తాకారంగాను ఉంటాయి. యుగాలతరబడి యుగాలు వాటిని చూస్తూంటే, ఆ కక్ష్యల ఆకారం మెల్లిగా మారుతూన్నట్లు తెలిసికొంటాము. వాటి మార్గాలు నిరవరోధంగా నుండవు. ఏమంటే సూర్య – నక్షత్ర సంఘటనచే ఆ పరిసరప్రాంతమంతా ద్రవ్య శకలాలతో నిండిపోయి ఉంటుంది. ఆ

శకలాలను నెట్టుకొంటూ గోళాలు తిరుగుతున్నప్పుడు వాటి కక్ష్యల ఆకారం మారుతూ శతకోటి సంవత్సరాల తరువాత సూర్యునిచుట్టు సుమారు వృత్తాకార మార్గాలలో సంచరిస్తూంటాయి. ఆ తిరుగుతూన్నవే గ్రహాలు. ఒక నక్షత్రం మరొక నక్షత్ర సమీపానికి వచ్చినప్పుడల్లా ఇట్టి సంఘటన జరిగితీరవలసినదే. అందుచేత ఒక నక్షత్ర ప్రభావం చేతనే సూర్యునినుండి గ్రహాలు పెకలించబడ్డాయని అనుకొనడానికి ఆధారముంది.

మన భూమిలోనున్న ఉదజని, కాల్షియం, ప్లాటినము మొదలైన పదార్థాలే సౌర వాతావరణంలో నున్నాయి. సూర్య ద్రవ్యం గడ్డకట్టగా ఏర్పడినదే భూమి కాబట్టి, భూమిలోనున్న పదార్థాలే సూర్యునిలో ఉండక తప్పదు. సూర్యగోళ మధ్యభాగమందేయే పదార్థాలున్నాయో చెప్పలేము; వాటిని తెలిసికొనే అవకాశం లేదు. కాని, ఇంతవరకు చేసిన పరిశోధనల వల్ల తెలియవచ్చిన సత్యం, భూమిలోనున్న పదార్థాలన్నీ సూర్యునిలో నున్నాయని. ఇక్కడలేనివి సూర్యునిలో నున్నాయను కొనడానికి కారణాలు కనిపించవు.

ఈ మధ్యనే మరొక వాదం ప్రతిపాదింపబడింది. ఆధునిక వైజ్ఞానికాభిప్రాయాలను ఆధారంగా చేసికొని జీన్సు వాదానికి భిన్నమైన వాదాన్ని కొందరుసూచించేరు. దానికి ముఖ్యాధారం ఒక్క పరిశీలన; మన గెలక్సీలో విరళంగానున్న నెబ్యులా ముందు గోచరించిన నల్లటిమచ్చలు. వాటి సంగతి శ్రద్ధగా పరిశీలించిన మీదట తేలిన విషయమేమంటే ఈ నల్లటి మచ్చలలో నున్న ధూళివాయువుల భారం సూర్యుని భారమంత కలదనీ, వాటి పరిమాణం మన సూర్యునికీ, సూర్యునికి దగ్గరగానున్న నక్షత్రానికిమధ్యనున్న ప్రదేశమంత ఉన్నదనీ.

అయితే, 25 లక్షలకోట్ల మైళ్ళనిడివిని శూన్యాకాశం, ఆకాశంలో విరళంగా వాయువుతోకూడిన ధూళి, దాని చుట్టూ అన్నివైపులా నక్షత్రాలూ ఉంటే, ఆ విరళవాయువుపై నక్షత్రకాంతి ఒత్తిడి కలిగించి, దానిని పీడిస్తుందని నమ్మడానికాధారాలున్నాయి. సూర్యుని కాంతి కిరణాల ఒత్తిడిచేతనే తోకచుక్కలకు తోక ఏర్పడుతూంది. తోక ఎల్లప్పుడూ సూర్యునినుండి దూరంగా నుంటుంది. కాగా, ఆ విధమైన ఒత్తిడికిలోనైన విరళ ద్రవ్యం సంకోచమొందకతప్పదు. సంకోచిస్తూండగా ఆ ద్రవ్యభాగాలు దగ్గర దగ్గరగా చేరుతాయి. దానివల్ల వాటి గురుత్వాకర్షణబలం ఎక్కువౌతుంది. అందుచే మరికొంత సంకోచిస్తుంది. అప్పుడు ఆ అధిక గురుత్వాకర్షణబలానికి ఆ ద్రవ్యంయొక్క పీడనం, తాపక్రమం ఎక్కువౌతూంటుంది. దానితో ద్రవ్యం ఉజ్జ్వలమై తుదకు నక్షత్ర రూపం ధరిస్తుంది.

ఈ ప్రక్రియలో, ద్రవ్యమంతా ఒకే గోళంగా కుదింపబడక కొన్ని భాగాలుగా విభజింపబడింది. అంటే, సూర్యునితోనే గ్రహాలు కూడా ఏర్పడ్డట్లు భావించవచ్చును. బుధ, శుక్ర భూకుజుల నావరించిన వాయువులు ఎగిరిపోయినాయి; శని గురుల నావరించినవి వాటి నాశ్రయించుకొనే

ఉన్నాయి. ఈ విధంగానే సౌర మండలం ఏర్పడినదని అంగీకరిస్తే సూర్యుడేర్పడగా గ్రహాలకు కావలసినద్రవ్యం మిగిలి ఉంటుందనుకోడానికి అభ్యంతరంలేదు. ఈ సాంద్రీకరణమే ఇంతకంటె సంకులంగా జరిగినదనుకొంటే సూర్యునివంటి నక్షత్రము దానినాశ్రయించిన గ్రహాలుకాక, రెండు నక్షత్రాలో, మూడు నక్షత్రాలో, లేక నాలుగు నక్షత్రాలో ఒకే విరళద్రవ్యరాశినుండి ఏర్పడవచ్చును. ఈ వాదానికిప్పుడు బలం ఎక్కువగానున్నట్లు కనిపిస్తూంది. ఏమంటే ఏకాకులుగానున్న నక్షత్రాలకంటె జంటగానున్నవే ఆకాశంలో అధికంగా గోచరిస్తున్నాయి. గురుత్వాకర్షణ సూత్రాల నుపయోగించి వాటి భారాలు కనుగొన్నారు. వాటి వేగాలనుకూడా గణితంవల్ల నిర్ణయించేరు. చుక్కల జంటలో రెండూ ఒకేబరువుగల జంటలు అరుదుగా నున్నాయి. వాటి బరువులలో చాల వ్యత్యాసముంది. జంటలో ఒకదానికంటె రెండవది వెయ్యిరెట్లు బరువుగానున్నవి ఉన్నాయి; లక్షలరెట్లు బరువున్నవి ఉన్నాయి. ఏరకం జంటలు ఎక్కువ ఉన్నాయంటే చెప్పలేము. దానికొక నియమంలేదు.

అయితే, ఒకజంటలో చిన్ననక్షత్రం బరువు పెద్దదాని బరువులో వెయ్యోవవంతు మాత్రముంటే, చిన్ననక్షత్రం సులభంగా కనిపించదు. ఆ చిన్నమూర్తి నక్షత్రంకాక స్వయంప్రకాశంలేని గ్రహమైతే అది కనపడడం మరీ కష్టమే. మన సూర్యగురులను అట్టి జంటగా పరిగణింపవచ్చును. గురుని భారం సూర్యభారంలో వెయ్యోవవంతు; గురునికి స్వయంప్రకాశంలేదు. సూర్యరశ్మిని పరావర్తించి వెలుగొందుచున్నాడు. మన కతిసమీపంగానున్న నక్షత్రంనుండి పరిశీలించినా గురుడు కనిపించడు. అయినప్పటికి అట్టి జంటలే మిక్కుటంగా నున్నాయనడానికే ప్రబలమైన సాక్ష్యముంది. ఈ వాదాన్నిబట్టి, మన గెలక్సీలో కొన్ని కోట్ల సౌరమండలాలున్నాయని చెప్పడాని కవకాశం ఈనాడెక్కువగా కనిపిస్తూంది. అదే నిజమైతే ప్రతినక్షత్రానికి గ్రహాలుండవచ్చు. అప్పుడు గ్రహకూటాలు సాధారణమైన నభోమూర్తము లౌతాయి. నక్షత్రాల సంఘాతంవల్ల ఏర్పడి అపురూపంగా నున్నాయనడానికి వీలుండదు.

సౌరమండలం ఏవిధంగా ఏర్పడినప్పటికి, గ్రహోద్భవమైన తరువాత గ్రహాలు కాలక్రమేణ పరిణామ మొందుతున్నాయన్నది నిశ్చయం. పైని వివరించిన రెండు వాదాలు విరుద్ధంగానున్నాయి. దేని నంగీకరించినా నష్టం లేదనుకోరాదు. జగచ్చిత్రాన్ని ఊహించుకొనే విషయంలో వాటి తారతమ్యాన్ని గమనిద్దాము.

గ్రహాల నొకసారి సమీక్షిస్తే వాటి పరిమాణాలలో చాల వ్యత్యాసమున్నదన్న విషయం మొదట తెలియవస్తుంది. సుమారు గోళాకారంలోనున్న ఈ గ్రహాలన్నిటిలో చిన్నదైన బుధుని వ్యాసం 3100 మైళ్ళు; పెద్దదైన గురునివ్యాసం 88,700 మైళ్ళు. సూర్యునినుండి వాటి దూరాలు 3½ నుండి 367 కోట్ల మైళ్ళవర కున్నాయి. అవి సూర్యునికినిత్యప్రదక్షిణాలుచేస్తూ సుమారు

వృత్తాకారకక్ష్యలలో తిరుగుతూన్నప్పుడు, వాటి పరిభ్రమణ కాలాలు — సూర్యునికి ఒక ప్రదక్షిణం చేయడానికి పట్టుకాలం — 88 రోజులనుండి 250 సంవత్సరాలవరకున్నాయి. వాటి ఆత్మప్రదక్షిణకాలాలలో — అక్షంపై ఒకసారి తిరగడానికి పట్టుకాలం — అంత వ్యత్యాసం కనిపించదు. మిక్కిలి వడిగా ఆత్మ ప్రదక్షిణంచేయు గురుని భ్రమణ కాలం 9-గం. 53-ని. అయితే, మిక్కిలి మందంగా భ్రమించు బుధుని ఆత్మ ప్రదక్షిణ కాలం 88 రోజులు. వాటి బరువులలో కూడా ఎక్కువ వ్యత్యాసముంది.

గ్రహాలయొక్క భౌతికావస్థలు కొన్ని ప్రధాన విషయాలమీద ఆధారపడి ఉంటాయి. అవి: గ్రహంయొక్క భారం, దాని ఘన పరిమాణం, సూర్యునినుండి దాని దూరం, దాని ఆత్మ భ్రమణకాలం. గ్రహాలన్నీ మండుతూన్న గోళాలుగా శూన్యాకాశంలో జన్మించి ఉంటే, వాటి వేడిని వికిరణంవల్ల పోగొట్టుకొంటూ క్రమంగా చల్లారడంలో చిన్నవి ముందు చల్లారడం, పెద్దవి మెల్లగా చల్లారడం జరుగకతప్పదు. దీనిమూలంగా గ్రహాల తాపక్రమం అవిచ్ఛిన్నంగా తగ్గవలసిందే, కాని, సూర్యునినుండి నిరంతరంగా అవి తేజోస్థాణలను గ్రహిస్తూండడంచేత, పూర్తిగా అవి చల్లారి పోలేదు. అయితే ఒక గ్రహానికి లభించే సూర్యరశ్మి పరిమాణం దాని ఉపరితలవైశాల్యంపైని, సూర్యునినుండి దాని దూరంపైని ఆధారపడి ఉంటుంది. కాంతి తీక్ష్ణత విలోమవర్గ (inverse square) నియమాన్ని అనుసరిస్తుందని జ్ఞాపకముంచుకొంటే, దూరంగానున్న గ్రహాలకంటె దగ్గరగానున్నవాటికి ఎక్కువ తేజోస్థాణాలు లభిస్తాయని స్పష్టమే. ఎక్కువ బరువున్న గ్రహాలు అంతరుష్ణాన్ని ఎక్కువగా కాపాడుకోగలవు.

ఎక్కువ బరువున్న గ్రహాలకు ఎక్కువ వాతావరణం (atmosphere) ఉండే అవకాశముంది. వాయువులోని అణువులు నిరంతరం సంక్షోభిస్తూంటాయి; మహావేగంతో దశదిశలు పరుగెత్తుతూంటాయి. అట్టి అణువులను శూన్యాకాశంలోనికి పారిపోకుండ పట్టిఉంచేది గురుత్వాకర్షణ బలం. గురుత్వాకర్షణబలం గ్రహంయొక్క ద్రవ్యరాశిపై ఆధారపడి, బరువైన గ్రహాల బలం ఎక్కువగానుంటుంది. చంద్రుని బరువు భూభారంలో ఎనభై ఒకటవ వంతు. చంద్రునిలో వాతావరణమే లేదు. అణువుల వేగాలు ఎక్కువైతే తాపక్రమం పెరుగుతుంది. అందుచేత, అల్పతాపక్రమంగల గ్రహాలలో అణువులవేగంకూడా సాపేక్షంగా తక్కువ. కాగా, సమానభారాలుగల గ్రహాలలో తక్కువ తాపక్రమంవద్దనున్న గ్రహానికి ఎక్కువ వాతావరణముండే అవకాశముంది.

ఆత్మభ్రమణం చేస్తూన్న గ్రహాలో ఒక గోళార్ధం ఎప్పుడూ సూర్యుని వైపునకుండి, సూర్యరశ్మిచే వేడెక్కుతుంది. అంటే, పగటివేళ సూర్యముఖమై యున్న సగం వేడెక్కుతూండగా, రెండవసగం చల్లారుతుంటుంది. గ్రహానికి అంతరుష్ణం స్వల్పంగానుండి దానికట్టే వాతావరణం

లేకపోతే, దాని మధ్యాహ్న తాపక్రమానికి అర్ధరాత్రి తాపక్రమానికి చాలా వ్యత్యాసముంటుంది. దాని ఆత్మభ్రమణ వేగమధిక మైనప్పుడు పై తాపక్రమాల వ్యత్యాసం కొంతవరకు తగ్గుతుంది. ఏమంటే, నిశాసమయాన్ని చల్లారే లోపుగా సూర్యోదయమై, బాగా చల్లారక పూర్వమే మరల వేడెక్కుతుంది. అనగా, వడివడిగా ఆత్మభ్రమణం చేయు గ్రహాలలో అట్టే తాపక్రమ వ్యత్యాసముండదు. మనభూమి 24 గంటలలో ఒక ఆత్మ భ్రమణం చేస్తుంది; దానికి మంచి వాతావరణముంది - ప్రతి చదరపు అంగుళాన్ని సుమారు 5 వీశల బరువుతో నొక్కుతూందని జ్ఞాపకముంచుకోవాలి. సూర్యుని నుండి దానిదూరం అట్టేలేదు నవగ్రహాలలో సూర్యునినుండి మూడవది. ఆ కారణాలచేత రాత్రింబగళ్ళలో కలుగు తాపక్రమ వ్యత్యాసం మనభూమిలో జాస్తిగా లేదు. చంద్రుడుకూడా, సూర్యునినుండి సుమా రంతదూరాన్నే ఉన్న ఉపగ్రహం. కాని, దానికి అంతరుష్ణం అట్టేలేదు. ఆత్మభ్రమణ కాలంకూడా చాల ఎక్కువ; సుమారు 28 రోజులలో ఒకసారి తనలో తను తిరగడు. అందుచేత ఒక చాంద్ర దినంలో వాటిల్లు తాపక్రమవ్యత్యాసం మిక్కుటంగా నుంటుంది. జీన్సు అంటాడు: సూర్యోదయంముందు చంద్రుని తాపక్రమం (ఆ ప్రదేశంలో) సుమారు - 250° ఫారన్ హీటు ఉండవచ్చు, మధ్యాహ్న మయ్యే సరికి ఆ ప్రదేశంలో తాపక్రమం 200° ఫా॥కి పెరగవచ్చు. అది రమారమి నీటి యొక్క మరుగు తాపక్రమం.

మన మెరిగిన జీవంవంటి జీవం పుట్టడానికి పెరగడానికి అవసరమైన భౌతికావసరాల సందర్భంలో పై విషయాలచర్చ కొంత లాభకరంగా కనిపిస్తూంది. జీవోద్భవానికి అత్యంతావశ్యకమైనవి అనుకూలమైన భౌతికావసరాలు. అవి సిద్ధించినంత మాత్రాన్న జీవం పుట్టినా పుట్టకపోయినా జీవం వర్ధిల్లడానికి వాటి అవసరం ఎంతైనా ఉంది. సూర్యునికి దగ్గరగానున్న బుధుడు చాల వేడిగా ఉండాలి. బుధుని పరిభ్రమణ ఆత్మభ్రమణ కాలాలు సమానం కావడంచేత, బుధునిలో ఒక సగం ఎల్లప్పుడూ సూర్యునివైపే ఉంటుంది; ఆ భాగాని కెప్పుడూ పగలే, మిగిలిన సగానికి నిత్యం రాత్రే. బుధునిలో సూర్యోదయ అస్తమయాలు క్రమంగా జరగవు. పగటి భాగం ఎంతో వేడెక్కి ఉంటుంది; రాత్రి భాగం చాల చల్లగా ఉంటుంది.

బుధుని తరువాతనున్న శుక్రుడు భూమి కంటె సూర్యునికి దగ్గర. పరిమాణంలో శుక్రుడు భూమికి సమానం. శుక్రునికి వాతావరణముంది. దాని దినప్రమాణం సుమారు మన మూడుదినాలంత దీర్ఘం. మన 8 మాసాలు దానికొక సంవత్సరం. దీర్ఘమైన దినప్రమాణంచేత, ఒకరోజులో కలుగు తాపక్రమపు మార్పులు ఎక్కువగా నుంటాయి. కాని, క్రమంగా శుక్రునిలో భూలోకపరిస్థితులవంటివే సిద్ధించవచ్చును. శుక్రుని తరువాత భూమి, భూమితరువాత కుజుడు ఉన్నాయి. కుజునిదూరం సూర్యుని నుండి ఎక్కువ. కుజవ్యాసం భూవ్యాసంలో సగంకంటె తక్కువ. దాని దిన

ప్రమాణం మన దినప్రమాణానికి సమానం. మన 23 నెలలకంటె కొద్దిగా దాని సంవత్సరంతక్కువ. దాని తరువాతనున్నవి పెద్దగ్రహాలు గురుడు, శని. వాటికి వాతావరణముంది. వాటి దినప్రమాణాలు సుమారు పదేసి గంటలు. వాటి సంవత్సరాలు క్రమంగా మన 12, 30 సంవత్సరాలంత దీర్ఘమైనవి. వాటికంటె దూరంగానున్న యురేనసు, నెప్ట్యూన్, ప్లూటోలు జీవానుకూలమయ్యే అవకాశమేలేదు.

సూర్యుని చుట్టునున్న సమశీతోష్ణమండలంలో మనభూమిపరిభ్రమిస్తూన్నట్లుంది. భూమిలో కోట్లకొలది జీవరాశులున్నాయి. మునుముందెప్పుడైనా శుక్రుడు జీవాస్పదం కావచ్చు. అనుకూల భౌతికావస్థలే దానికి కారణమైతే కొన్ని శతసహస్రాబ్దాలపూర్వం కుజునిలో జీవం జనించి ఉండవచ్చు. జీవంపుట్టి ఉంటే కుజలోకవాసులొకప్పుడున్నారనేది నిర్వివాదం. ఇప్పటికి వారుండవచ్చు. దానివిషయమై కచ్చితంగా చెప్పలేము. ఒకసారి పుట్టినజీవం ఏదోవిధంగా వర్ధిల్లడానికే ప్రయత్నిస్తూంటుంది. కొన్ని జీవజాతులు నశించవచ్చు. కొన్ని పరిణామం చెందవచ్చు. కాని, ప్రకృతి విపర్యయాలను తట్టుకోగల సామర్థ్యం పెంపొందించుకొనేటట్లుంది. ఆదే నిజమైతే కుజవాసులు అభ్యుదయ మార్గాలననుగమిస్తూ, వైజ్ఞానికంగా పురోగమిస్తూ ఇతరలోక వాసులతో సంప్రతించే యత్నంలో నుంటారు.

శుక్రునిలో, ఇంతవరకు జీవంలేకపోయినా, ముందుముందు జనించవచ్చు. ఏమంటే మరికొంతకాలం పోయిన తరువాత కాని, భూమిలోనున్న అనుకూల భౌతికావస్థల వంటివి శుక్రునిలో కలుగలేవు.

మనకత్యంత సమీపంగానున్నది చంద్రగోళం. అది కూతవేటుదూరాన్న ఉందనవచ్చు, సుమారు 250000 మైళ్లు. మనకున్న పెద్దదూరదర్శిని దానిని వెయ్యిరెట్లుదగ్గరకు తెచ్చినట్లు చూపుతుంది. కొన్నికోట్ల యేండ్ల క్రితం జీవానుకూలమైన భౌతికావస్థలు చంద్రునిలో ఉండి ఉండవచ్చును. ఆ కాలంలో జీవంజనించి ఉండవచ్చును. కాని, ప్రస్తుతస్థితిలో జీవం వర్ధిల్లగలసూచనలు కనిపించవు. అంతరుష్ణం తగ్గిపోతూంటే, వాతావరణ తాపక్రమం క్షీణిస్తూంటే చంద్రతలంలోనికి జొరబడి ప్రాణాలు కాపాడుకోడానికై జీవంచేసిన ప్రయత్నం వ్యర్థమైయుండవచ్చును. ఏ విధంగా యోచించినా, చంద్రునిలో జీవంలేదని చెప్పడానికే అవకాశాలెక్కువగా నున్నాయి.

సౌర కుటుంబంలో తొమ్మిది గ్రహాలున్నాయి, పాతికకుపైగా ఉపగ్రహాలున్నాయి; వేలకొలది గ్రహశకలాలున్నాయి. వీటిని జాగ్రత్తగా పరిశీలించినప్పుడు తేలిన సారాంశమేమంటే, మన మెరిగిన జీవం వంటి జీవం ఏ ఇతర ఖగోళంలోను కనిపించే అవకాశంలేదని, రెండునక్షత్రాల ఆకర్షణ బలంవల్లనే గ్రహాలు జనించినట్లయితే, మన గెలక్సీలో సౌరమండలాలే అపురూపమైనవి. ఏమంటే, అట్టిప్రమాదం సామాన్యంగా సంభవించదు. అంటే, కోట్లకొలది నక్షత్రాలుగల మన గెలక్సీలో మనభూమి ఏకాకిగా నున్నదని అంగీకరిం

చాలి. అపరిమితాకాశాలచే వేరుచేయబడి బృహత్పరిమాణంగల పరితప్తవాయుగోళాలను అసంఖ్యాకంగా గల ఈ విశ్వంలో అనుకూల భౌతికావసరాలలో కాని పెరగలేని జీవానికి స్థానమున్నట్లు కన్పించదు. ఒక ప్రమాదమే జీవోద్భవానికి కారణమైతే మరొక ప్రమాదం జీవాన్ని నాశనం చేయవచ్చు. విశ్వసంచారం చేస్తూన్న ఏ తోకచుక్కగాని పెద్ద ఉల్కగాని, భూమిని జీవంతో డీకొని భిన్నం చేయవచ్చు. ఏ విధంగా చూచినా మన భవిష్యత్తు సుఖదాయకమనలేము. విజ్ఞాని సి. ఇ. ఎం. జోడ్* చెప్పినట్లు మానవులు నశించక తప్పదు. మనభూమి ఒకప్పుడు జీవానుకూలంగా నుండేది కాదు. అప్పుడున్నది అపరిమితమైన వేడి. జీవానుకూలంగా ఉండజాలని సమయం మును ముందొకప్పుడాసన్నమౌతుంది. అప్పుడు చెప్పలేనంత చల్లగానుంటుంది. సూర్యుడు లయంకాకపూర్వమే మానవులు మాయమౌతారు. అవసానసమయంలో నివసించు మానవులబుద్ధి మొద్దువారుతుంది. తరతరాలుగా శ్రమించి పెంపొందించిన కళలు శాస్త్రాలు వారు మరచిపోతారు. మృగసన్నిభంగా హిమగిరులలో సంచరిస్తారు. ప్రతికూల వాతావరణానికి తుదిమానవుడు ప్రాణమర్పిస్తాడు. కాని, భూమిమాత్రం, మంచుకొండలచే కప్పబడిన శిల్పాన్నికళాఖండాలని మోస్తూ, నిశ్శబ్దకాలాకాశంలో యాత్రసాగిస్తూనే ఉంటుంది.

కాంతి పీడనంవల్ల విరళద్రవ్యం ప్రోగై సౌరమండలమేర్పడిందన్న వాదం నిజమైతేనేమి? నక్షత్రాంతరాళంలో ధూళి వాయు సమ్మిశ్రితమైన అదృశ్యంగానున్న ద్రవ్యం పరిసరనక్షత్ర కాంతిచే కుదించబడి, వేడెక్కి, తాపక్రమంలో పెరిగి నక్షత్రమౌతుంది. ఆ ప్రక్రియలో గ్రహాలేర్పడడానికి తగినంత ద్రవ్యం మిగులుతుంది. అందుచేత గ్రహకుటుంబాలు సామాన్యంగా ఏర్పడే అవకాశముంది. ప్రతి గ్రహకుటుంబంలోను ఆ సూర్యుని చుట్టు సమశీతోష్ణ మండలంలో పరిభ్రమించు గ్రహముండవచ్చు. ఆ గ్రహంపై, అనుకూల వాతావరణ కారణంగా, జీవం జనించవచ్చు. అంటే, గ్రహకుటుంబంలో ఒక్క గ్రహమైనా జీవాస్పదం కాగలదు. అట్టి గ్రహకుటుంబాలు శతసహస్రాధికంగా నున్నాయంటే, జీవానుకూల లోకాలు సైతము లక్షలాదిగా నున్నాయనుట తథ్యం. ప్రతిలోకంలోను జీవం, ఆత్మసంరక్షణార్థం, ప్రకృతితో పోరాటం సాగిస్తూంది. మనభూమి ఏకాకి కాదు. పరలోకవాసులతో ఇప్పటివరకు సంప్రతించలేకపోయినప్పటికి, మనవంటి జీవులు అసంఖ్యాకంగా నున్నారన్నది స్వల్పవిషయంగాదు. విశ్వంలో జీవం ఎల్లప్పుడూ ఉంటూంది. విశ్వానికి జీవం వైదేశికంగాదు. విశ్వప్రణాళికలో జీవానికి నిశ్చితస్థానముంది. పరలోక జీవులుకూడ మనవలెనే అభ్యుదయమార్గాల ననుగమించడానికై శ్రమిస్తున్నారు. వారితో సంప్రతించలేమని చెప్పగలమా? మానసికంగా వారికి హెచ్చరించగలమని ఆశించుట అడియాసకాదు., ఇంతకూ జీవులాశాబద్ధులు కదా !

వసంతరావు వేంకటరావు.

*C. E. M. Joad : Guide to Modern Thought.

జయము అనగా మనోనిగ్రహము, తపశ్శక్తి గలిగియుండవలెనని తలంచి ముందుగానే సంస్కృతభాషను చాలవరకు అభ్యసించి శేషాచలమున నిర్జనప్రదేశములో తపమొనర్చుటకు కారణమైనది. వీరి జీవితమంతయు సంపూర్ణముగా తెలుసుకొన తలంచువారు వ్యాసాశ్రమమువారు ప్రకటించిన రజతోత్సవ సంచికలో గనందగును. తిరుపతిలో తపమొనరించుటకు కారణమేమన, తపస్సిద్ధి నిర్విఘ్నముగా కలుగవలసియుండిన ఒక పుణ్యభూమియు, తాను కోరినను దొరకని భోజనాది వస్తువులు లభించని యేకాంత ప్రదేశమున్ను, కేవలము శరీరమునిలుచుటకు మాత్రము ఆహారములభించు ప్రదేశమున్ను యుండవలయునని ఆశయముతోనే అట్టి నిర్జనప్రదేశమునతపమొనర్చుటకు నిశ్చయించిరి. ఇట్లయినమాత్రమే మనస్సు స్వాధీనములోయుండునని వారి ఆశయము. దీపమునకు తైలమువలె ఆత్మజ్ఞానజ్యోతికి బ్రహ్మచర్యవ్రతము అత్యవసరమని వారి పూర్వజన్మసంస్కారమువల్లనే బాల్యావస్థనుండి హృదయమందు దృఢముగా నాటుకొన్నందుచే బ్రహ్మచర్యవ్రతమును సంరక్షించుటకు యత్నపరులైయుండిరి. ఈ భావనములన్నియు అంతర్నిహితములై యుండుటవల్లను తిరుపతిలోనే చాలాకాలము తపమొనర్చు [illegible]లు ఏర్పడుటచేతను తన జన్మభూమియగు కేరళదేశము వెళ్ళక ఆంధ్రదేశములోనే ఆశ్రమము నిర్మాణము చేయవలయునని తలంపుగలిగెను. ఆ విషయమై అనేకభక్తులతో తగిన ప్రదేశమునుగురించి ప్రశ్నింపగా యిప్పుడుస్థాపించియుండు వ్యాసాశ్రమము తగినస్థలమని అందరున్ను చెప్పుటవల్ల అలాగుననే చేయడమైనది. ఆశ్రమ స్థాపనమునకు నాల్గు అంగములు కలిగియుండవలయును.

1. గ్రామమునకు నిండా దగ్గరయు, చాలా దూరముగాను యుండరాదు.

2. జలాశయము సమృద్ధిగా యుండవలయును.

3 స్వతంత్రస్థలముగాయుండవలయును

4. రైలుస్టేషన్, పోస్టు ఆఫీసు దగ్గరా గలిగియుండవలయును. వీనితో సహా ఒక పుణ్యభూమియు గలిగియుండిన బాగుండును. పై చెప్పిన అన్ని అంగములున్ను యిప్పుడు స్థాపించియుండు వ్యాసాశ్రమమునకు గలిగియున్నవి. ఇది చిత్తూరుజిల్లా కాళహస్తి తాలూకా యేర్పేడు గ్రామ సమీపమున నెలకొనియున్నది. కావునఆశ్రమమును దర్శనముచేయతలంచువారుకాని, జాబుల్వ్రాసి గ్రహించుకొనతలంచువారు కాని ఈ క్రింది విలాసమునకు వ్రాసిన చాలును. శ్రీ వ్యాసాశ్రమము, యేర్పేడు పోస్టు,(చిత్తూరుజిల్లా) అనివ్రాసినచాలును. వారు కేవలము ఆత్మ విచారముతో మాత్రము కాలముగడిపిన చాలదనియు, పూర్వికఋషుల సాంప్రదాయమును అనుసరించి బ్రహ్మ నిష్ఠలను వృద్ధిపరచుటయు, సంస్కృత విద్యతో, లోకోచితవిద్యను గూడ నేర్పి బ్రహ్మచారులను అభివృద్ధిలోనికి తీసుకొనిరావలయునని తలంపుగలిగి యుండుటవల్ల పై చెప్పిన ద్వివిధమార్గములకుతగిన యేర్పాటుచేయడమైనది. వీనికి వారిమాతృ

భాష, మలయాళము గాక, అరవము, సంస్కృతము, హిందీ, ఆంధ్రము మొదలగు భాషలువచ్చును. తెలుగుభాషలో, బాగుగా పరిచయము గలిగినందు చేతను, ఆంధ్రములో అనేక గ్రంథములు వ్రాయుటకు తగిన అవకాశము గలిగినది. వీరు వ్రాసిన పుస్తకములలో (1) శ్రీ శుష్కవేదాంత తమోభాస్కరము, (2) స్వబోధసుధాకరము, (3) ధర్మసేతువు, (4) ఓంకారము, ప్రణవోపాసనము, (5) ఈశ్వరకృప, (6) కర్మసిద్ధాంతము, (7) ఓంకార సత్రయాగము, (8) గృహస్థాశ్రమధర్మము, (9) బ్రహ్మచర్యము, (10) నిర్విఘ్నయోగసిద్ధి మొదలగునవి ముఖ్యములు. ఈలాగున యిప్పటికి 58 గ్రంథములు వ్రాసియున్నారు. ఇవి ఆంధ్రభాష తెలిసిన దేశములోగల జనులు అనేకులు తెప్పించి చదువుచున్నారు. శ్రీ శుష్కవేదాంత తమోభాస్కరము తిరుపతిలో తపోనిష్ఠలోయుండేకాలమున వ్రాసినదగుటచే, యిప్పటికి తొమ్మిదిసార్లు ముద్రించడమైనది. 29,000 గ్రంథములు ప్రపంచములో వ్యాపించియున్నవి. ఇదిన్ని గాక యథార్థభారతి యను ఆధ్యాత్మిక జ్ఞానవిషయకమైన ఒక మాసపత్రికయును నడుపుచున్నారు. ఇది 23 సంవత్సరముల నుండి ప్రచారములోయుండి యున్నవి. ఆకాలమున ఆధ్యాత్మిక జ్ఞానసంబంధపత్రిక తెనుంగున లేదనియే చెప్పవచ్చును. తరువాత యిప్పుడిప్పుడు శ్రీ రామకృష్ణప్రభ, గీతావాణి మొదలగు అనేక మాసపత్రికలు యేర్పడినవి. శ్రీ భగవద్గీతయనిన శ్రీ వార్కి ప్రాణమువంటిది. పరమాద్వైతమే తనలక్ష్యమైనను, సాకారభక్తియందుకూడ గొప్ప విశ్వాసము గలిగియున్నారు. అది అసత్యమని కాని ప్రయోజనము లేదని గాని వారి ఆశయము కాదు. భక్తుల ఆశయమును అనుసరించి భగవంతుడు ప్రవర్తించును. సామాన్యగురువుల మార్గములో వారికి ప్రీతియుండదు. చిన్నకాలములోనుండియు, శ్రీ బుద్ధదేవునియందు, శ్రీ యేసుక్రీస్తువునందు, శ్రీ మహామద్ నబియందు, శ్రీ శంకరాచార్యుల యందు మాత్రమే పూర్ణవిశ్వాసము గలిగియుండెను. తరువాత శ్రీ రామకృష్ణపరమహంస యందును శ్రీ నారాయణగురుస్వాములయందును భక్తిగలిగెను. సిద్ధ శ్రీ శివలింగగురు స్వాములవారు వీరిగురువులు. శ్రీ భగవద్గీతకు, (1) పదవిభాగము, (2) టీక, (3) తాత్పర్యము, (4) విశేషార్థములతో గూడి గీతార్థప్రకాశయను గ్రంథమును రచించిరి. ఇది ఆంధ్రదేశములోగాక ఆంధ్రులు నివసించు సౌత్ ఆఫ్రికా, రంగూన్, సిలోన్, మొదలగు దేశములలోకూడ వ్యాపకములో యుండియున్నది. శ్లోకతాత్పర్యములతోకూడ మరియొక్క గ్రంథముగలదు. స్థూలాక్షరంలో నాగరిలిపివంటి పెద్దఅక్షరములతో మూలంమాత్రము యింకొకటిగలదు. మూలంమాత్రము పారాయణోపయుక్తముగా మరియొక్క గ్రంథమ యున్నది. యిది యిప్పటికి తొమ్మిదిసార్లు అచ్చు ఆయినది. మొత్తము 48 వేల ప్రతులు అచ్చు అయినచో భగవద్గీతకు యెంత ప్రచారము గలుగచేసినారో భక్తులూహించుకొనవచ్చును. గీతాశయమను మరియొక గ్రంథమును గూడ వ్రాసియున్నారు.

ఇదిగాక మహాభాగవద్గీత అను మరియొక గ్రంథమును ప్రచురించిరి. యిది శ్రీ శంకర రామానుజభాష్యము మొదలుగాగల తొమ్మిది భాష్యకారుల ఆశయముతో కూడినది. దీనియందు పద్మపురాణములో సంస్కృతములోనుండి భగవద్గీత ఒక్కొక్క అధ్యాయమునకు ప్రత్యేక ప్రత్యేకముగల మాహాత్మ్యమును మూలముతో ఆంధ్ర తాత్పర్య సహితముగా అచ్చొత్తించబడెను. 18 అధ్యాయములకు 18 మాహాత్మ్యములు ఒక్కొక కథారూపముగా గూడినది. ప్రథమాధ్యాయమునుండి ఒక్కొక్కరున్ను గీతాపారాయణము చేసి మోక్షమునుపొందిన కథలు దీనియందు కనందగును. ఇదిన్ని గాక 32 వేల శ్లోకములతో గూడిన శ్రీ యోగవాసిష్ఠమనియు, వాసిష్ఠరామాయణమనియు పేరుగల లోకోన్నత గ్రంథమును పండితులచే ఆంధ్రానువాదము చేయించి అచ్చొత్తింపినారు. ఇది నాలుగువాల్యూములు. మరియు ఆత్మపురాణము, అనుభూతి ప్రకాశము మొదలగు తెలుగుభాషలోనికి యింతవరకు అచ్చుగాని గ్రంథములను పండితుల సహాయముతో ముద్రించిరి. శ్రీ పాతంజల యోగశాస్త్రమునకు, నారదభక్తిసూత్రమునకు, శాండిల్యభక్తిసూత్రమునకు పదవిభాగ, ప్రతిపదార్థ, టీక, తాత్పర్య విశేషార్థములు వ్రాసి ప్రచురించిరి. ఈ గ్రంథములన్నియు ప్రస్తుతము సజీవములైయుండి యున్నది. వ్యాసాశ్రమములో దొరకును, పాతంజల యోగశాస్త్రమునకున్ను శాండిల్యభక్తి సూత్రమునకున్ను కొందరి బ్రహ్మనిష్ఠులను పండితులసహాయముకూడ అలంబనమై యుండియున్నది. నారదపరివ్రాజకోపనిషత్తు ఆంధ్రమున యింతవరకు ఎవ్వరున్ను అనువాదము చేసియుండలేదు. దానినికూడ పండితులచే తెలుగుభాషలో అనువదింప చేయడమైనది.

ఈ స్వామి శ్రీ మలయాళ యతీన్ద్రి గీతయను పవిత్రగ్రంథమును 18 అధ్యాయములతో సంస్కృతభాషలో రచించిరి. అదియును అచ్చైనది. దీనియందు ఎవరెవరు ఏమేమి ప్రశ్నించిరో, వారి నామధేయములు కూడ గలవు. తెనుంగు తాత్పర్యము గూడ వ్రాయబడియున్నది. ఇదియును గాక 28 సంవత్సరములనుండి ప్రతి ఫాల్గున పౌర్ణిమనాడు 4 దినములు శ్రీ సనాతన వేదాంతజ్ఞానసభయను పేరుతో గొప్ప సమావేశమును జరుపుచుందురు. ఆ తఱి అనేకమంది పండితులను బ్రహ్మవేత్తలను ఆహ్వానించి ఉపన్యాసములను చేయించుచుందురు. వేలాదిజనులు సమావేశములో పాల్గొనుదురు.

ఇదిగాక సాధుమండలీ, ఓంకార సత్రయాగము, ఋషియజ్ఞము, సప్తాహములు, అష్టాదశాధ్యాయముక్తి సోపానము, మొదలైన పెక్కింటిని జరుపుచున్నారు. ఇవియంతయు భక్తులకువిదితమే; కృష్ణా, గోదావరీ నదతీరములలో మూడుసంవత్సరముల కొకతూరి శ్రీ చాతుర్మాస్య మహావ్రతమును, ఇప్పటికి 3 సార్లు జరపిరి. ఆ స్థలము, ఆ తీర్థ, నైమిశారణ్యమునవలె భక్తులకు గోచరించును. వందలాది స్త్రీ పురుషులు పాల్గొనుదురు. ఆ తఱి అది ఒక గ్రామముగా నం

ఘునని తోచకమానదు; ఇప్పుడు శ్రీ వారికి 71 సంవత్సరములయినవి. ఇప్పుడుగూడ, తాము చిన్నకాలమునుండి నెట్టి అనుష్ఠాన ధ్యానప్రవచనములు గలిగియుండిరో, ఆ లాగున జరుపుచున్నారు. ప్రతిసంవత్సరము ఫాల్గుణ పౌర్ణమిలో జరుగు శ్రీ సనాతన వేదాంత జ్ఞానసభకున్ను, మూడుసంవత్సరముల కొకసారివచ్చు చాతుర్మాస్య వ్రతమునకున్ను ఆశ్రమమునుంచి బయటవెళ్ళెదరు. తక్కిన కాలమంత యూ ఆశ్రమములో నేయుండి అనుష్ఠానముజేయుచు ధర్మప్రబోధముల గావించుచుందురు. బ్రహ్మవిద్యకు, బ్రహ్మజ్ఞానమునకు, శమదమాది గుణములుగల శ్రీ పురుషులందరున్ను అర్హులని వీరిసిద్ధాంతము.

మానవులు, మనుజులు, మనుష్యులు అని పిలువబడువారందరున్ను మను మహర్షి సంతతిలో చేరినవారనియు, గుణకర్మలచే మానవులకు భేదముగలదుగాని, మఱియొక విధముగా ఏలాటి భేదములేదని వీరి యాశయము. ఓమ్.

## గ్రంథ పరిచయము.

1. సంకీర్తన రామాయణము:— వెల 0–2–6.

శ్రీ సీతారామనామ సంకీర్తన సంఘము, శ్రీరామనామక్షేత్రము, గుంటూరు.

2. మానసప్రబోధము:— వెల 0–8–0.

కవి: శ్రీ కాపసరపు వెంకటకుటుంబరావుగారు, టీచరు జయ్ హింద్ హైస్కూలు, సర్కిల్ పేట, మచిలీపట్టణము.

"మనసా గురుపాదము లాశ్రయించుపుమా" అను మకుటముతో సుమారు 100 పద్యములు వ్రాయబడినవి. కవిగారు తమ గురువునందలి భక్తిభావముతో యీపద్యకుసుమములను సమర్పించినారు. శైలి ధారాళముగా హృద్యముగ నున్నది ఈ గ్రంథవిక్రయమునవచ్చు ద్రవ్యమును కవిగారు గురుసేవా కార్యములకై వెచ్చింప తలంచినారు.

---

## ప్ర క ట న.

కడపజిల్లా శ్రీ గండిక్షేత్రము నందలి శ్రీ భూమానందాశ్రమ స్థాపకులగు శ్రీ శ్రీ శ్రీ సద్గురు సాధురామయ్యగారి పంచదశవార్షిక గుర్వారాధనము 26–8–54 శ్రావణ బ 13 గురువారమునాడు శ్రీ భూమానందాశ్రమమునందె జరుగును. భక్తమహాశయులు ఆ పవిత్ర కార్యక్రమమున పాల్గొనవలెనని విన్నవించుచున్నాము.

ఇట్లు

శ్రీ భూమానందాశ్రమ ట్రస్టీసంఘం.

# శ్రీ భగవద్గీత

# శ్రీ మాధ్వభాష్యానువాదము.

విద్వాన్ — శ్రీ ఘూళీ కృష్ణమూర్త్యాచార్యులు, బళ్ళారి.

శ్రీ గీతాశాస్త్రము భారతమునందుగలదు. వేదానధికారులగు స్త్రీ, శూద్ర బ్రహ్మబంధువులకు సద్గతి కలుగవలెనను అనుకంపతో బ్రహ్మ రుద్రేంద్రాది సకలదేవతలు ప్రార్థింపగా శ్రీమన్నారాయణుడు వేదవ్యాసుడై యవతరించి పురాణేతిహాసముల రచించెను. అతని గ్రంథములన్నిట భారతము శ్రేష్ఠము. భారతమున గీతయు, విష్ణుసహస్రనామమును శ్రేష్ఠములు. అందు గీతను శ్రీకృష్ణుడర్జునుని కుపదేశించినట్లే, శ్రీకృష్ణాభిన్నుడగు వేదవ్యాసుడు భారతమునురచించియుంచి లోకోపకారియయ్యెను. అట్టిగీత మతభేదములచేతను, విచారవైచిత్ర్యములచేతను అర్థభేదముల చూపుచున్నదే కాని, నిజమైన తాత్పర్యమొక్క— శ్రీకృష్ణునివాక్యములచేతనే గ్రంథోద్దేశమును నిర్ణయింపగల భాష్యమునురచియించిన శ్రీ మధ్వాచార్యుల గ్రంథములచే స్ఫుటముగా తెలియనగుచున్నది.

గీత బోధించునదేమన,

1. పరమాత్మ సర్వోత్తముడు. అతడు సర్వత్రవ్యాప్తుడు, సర్వస్వతంత్రుడు, సర్వకర్త, ఆనందాదిగుణపూర్ణుడు, నిర్దోషుడు, మోక్షదాతయునైయున్నాడు.

2. జీవుడు అణుస్వరూపి, అనాదినిత్యుడు. ఐనను వానికి దేహ యోగవియోగ రూపములైన జననమరణములు కలవు.

3. దేహము నశ్వరము — ఎల్లప్పటికి అనిత్యము.

4. మోక్షమనగా పరమాత్మలో నైక్యమగుట, లేక సమానముగానుండుట, అను నీ రెండును కాదు. అనిష్టపరిహారమును ఇష్టప్రాప్తియు నను రెండుదశములుగల మోక్షదశలో జీవునికి తన స్వరూపానందము ప్రకటితమై అనుభవములోనికి వచ్చును. అప్పుడును జీవుడు పరమాత్మకధీనుడుగను, అతనికంటె భిన్నుడుగనుఉండును. పరమాత్మ స్వతంత్రుడనియు, అతని అధీనములో సర్వకాల, సర్వదేశ, సర్వావస్థలయందును నుండుజీవుడు పరతంత్రుడనియు తెలిసికొన్నవాడును మోక్షఫలయోగ్యుడగును.

5. వర్ణాశ్రమ విహితకర్మముచే అంతఃకరణశుద్ధియు, అంతఃకరణశుద్ధిచే పరోక్షజ్ఞానమును, పరోక్షజ్ఞానముచే అపరోక్షజ్ఞానమును, అపరోక్షజ్ఞానముచే భగవత్ప్రసాదమును, భగవత్ప్రసాదముచే నిజస్వరూపాభివ్యక్తి యను మోక్షమును కలుగును. కనుక విహితకర్మానుష్ఠానము మోక్షమునకు పరంపరా సాధనమగుచున్నది.

6. కర్మయోగము జ్ఞానయోగమునకు విరుద్ధముకాదు. కర్మజ్ఞానములకు కార్యకారణసంబంధము కలదు.

7. ప్రాణిమాత్రము కర్మలుచేయక ఒక్కక్షణమైన ఉండజాలదు. కర్మచేయవలసిన, దానిఫలమునం దాసక్తినుంచక భగవదారాధనకై స్వవర్ణాశ్రమ విహితకర్మమునే చేయవలెను. కర్మయోగులు, జ్ఞానయోగులుకూడా కర్మలచేయుట అవశ్యము – ఆ కర్మము భగవత్ప్రీతికొఱకయ్యే చేయఁదగును.

8. యుద్ధమునే గాని, యేవేమికర్మనే గాని ఫలాపేక్షలేక చేయవలెను.

9. వేదములలోని ప్రత్యక్షరము, శబ్దము, వాక్యముగూడ పరమాత్మనే ముఖ్యముగా ప్రతిపాదించుచున్నది. అంతియగాక అట్లు తెలిసికొనుటచేతనే మోక్షఫలమగునని వేదములే చెప్పుచున్నవి. పైపైకిగోచరించు స్వర్గాదులే ఫలములని తెలియుట పొరపాటగుచున్నది.

10. 'సన్యాసాశ్రమ స్వీకారమొనర్చి జ్ఞానయోగము నాచరించిరే మోక్షము పొందును' అను కట్టుబాటేమియులేదు. అన్యాశ్రమములవారునూ, అన్యవర్ణముల వారునూ విహితకర్మలనాచరించి, జ్ఞానముపొంది, మోక్షఫలయోగ్యులు కావచ్చును.

11. అర్జునుడు ఇంద్రావతారము కనుక అజ్ఞానియుకాదు. మూర్ఖుడంతకన్న కాదు అతడు జ్ఞానియే. శ్రీకృష్ణపరమాత్మ సకలేంద్రియ ప్రేరకుడగుటచే అర్జునునిలో మోహమునుపుట్టించి, అతని నెపముచేసికొని సకలలోకోద్ధారార్థమై, అతనికి గీతనుపదేశించెను.

12. సన్యాసమనగా కర్మత్యాగముకాదు. కాని దానిఫలమందలి ఆసక్తిని త్యజించుటయే. సన్యాసియై విహితకర్మానుష్ఠానమొనర్చి భగవంతుని కర్పించినచో, అది జ్ఞానముద్వారా మోక్షసాధనమగుచున్నది.

13. ఇంద్రియజయమును, మనోనిగ్రహమును, కామక్రోధాది అరిషడ్వర్గముల త్యాగమును ఆవశ్యకములు.

14. జగచ్చక్రము సరిగానడచుటకైనను కర్మలు చేయకతప్పదు.

15. పరమాత్మ సృష్టిప్రారంభమున దేవతలనూ ప్రజలనూ సృష్టించి వారికి విహితకర్మోపదేశ మొనరించెను. దేవతలిచ్చిన అన్నాదివస్తువులతో వారిని యజ్ఞాదులచే ఆరాధించి సంతోషపెట్టుటచే ప్రజలును, పరమాత్మ తమకువిధించిన అన్నాది దానయాగ విహితకర్మలచే నతని సంతోషపెట్టుటచే దేవతలును, మోక్షఫలమును పొందుచున్నారు.

16. పరమాత్మయొక్క అవతారములు ఇంద్రజాలమువలె మిథ్యకావు సత్యములే. అవి అధర్మనాశమునకును, ధర్మస్థాపనాభివృద్ధులకొఱకే జరుగుచున్నవి. అతని యవతారము కలియుగమునలేనందున నతనికి త్రియుగుడని పేరు.

17. కర్మస్వరూపముయొక్క యథార్థజ్ఞానము ఆవశ్యకము. కర్మమనగా పరమాత్మప్రీతికొఱకై చేయు వర్ణాశ్రమ విహితకర్మము. అకర్మమనగా కర్మత్యాగము

కాదు. కాని కర్మముయొక్క ఫలాసక్తిత్యాగములేక నిషిద్ధకర్మత్యాగము. వికర్మమనగా నిషిద్ధకర్మము. దానిని అనగా వికర్మను చేయరాదు.

18. మనముచేయు యజ్ఞములేవిగాని కర్మరూపములై పరమాత్మారాధనకై వినియోగింపబడుచున్నవి. ఎట్లనగా అతడు సకలయజ్ఞఫలభోక్తగానున్నాడు.

19. సన్న్యాసమనగా ఫలాసక్తిని సంకల్పము మొదలగువానిని విడుచుట. కర్మయోగమనగా నిష్కామకర్మాచరణము. కర్మాధికారుల కివి రెండు అవశ్యములే. జ్ఞానయోగికి దొరకుస్థానము కర్మయోగికిని దొరకును.

20. కర్మయోగము నాచరించుచూ ఇంద్రియ మనోనిగ్రహములచే పరమాత్మ విషయకధ్యానమును సంపాదించవలెను. దానిచే మనస్సు సంతుష్టమై ఆ భగవంతునిలో స్థిరమైనిలుచును. క్రమముగా అసంప్రజ్ఞాతసమాధిప్రాప్తమై, ఆ యవస్థలో ఆనందసాగరమగ్నుడై అన్ని ఇష్టఫలములను పొందును.

ఇట్లు గీతనుండి స్వీకరింపనగు ప్రమేయములింక నెన్నియోకలవు. గ్రంథవిస్తరభీతిచే విరమించుచున్నాను. సారాంశమేమన – జ్ఞానమువంటి పవిత్రవస్తు వింకొకటిలేదు. మరియు జ్ఞానమనగా పరమాత్మస్వరూపమును గురించినజ్ఞానమే. అట్టిజ్ఞానముకలుగవలెనన్న, గీతలో శ్రీకృష్ణపరమాత్మ యుపదేశించిన రహస్యతత్త్వములను తెలిసి, ఆచరించుచు మరలిమరలివచ్చు జన్మ మరణ రూప సంసారసాగరమును దాటి మోక్షమునుపొందుటకై ఎల్ల సజ్జనులు తప్పక ప్రయత్నించవలసినది. ఇట్టి ప్రయత్నమున నన్ను ప్రేరేపించి ఈ పవిత్రగ్రంథమును నాచే వ్రాయించి, ప్రచురింప బద్ధకంకణులైన శ్రీ గీతాసాహిత్యసేవాసమితివారి కేనెంతయు కృతజ్ఞుడను. ఇకముందు శ్రీ గీతను శ్లోకములవరుసలో శ్రీ మధ్వభాష్య, తాత్పర్యనిర్ణయ నామక పవిత్రగ్రంథసహాయమునను, శ్రీ మంత్రాలయ ప్రభువులగు శ్రీ శ్రీ శ్రీ రాఘవేంద్ర తీర్థస్వాములవారి వివృతినామక వ్యాఖ్యసహాయమునను, అనువదించి నాచేతనైనంత సరళభాషలో పాఠకలోకమునకందజేయు సామర్థ్యమొసంగి, నిర్విఘ్నముగా నెరవేర్చి, నన్ను కృతార్థునిజేయ శ్రీ పరాత్పరుని, గీతామృత గోపాలుని ప్రార్థించుచున్నాడను. విశాలహృదయులగు పాఠకులు సరళస్వభావులు గనుక శ్రీ శాంకర రామానుజభాష్యపద్ధతుల ననుసరించి ధన్యులైనరీతి నీ శ్రీ మాధ్వభాష్యసరణినిగూడ విచారించి కృతార్థులగుదురుగాక యని యభ్యర్థించు,

విద్వజ్జన వశంవదుడు,

ఘూళీ కృష్ణమూర్త్యాచార్యులు.

(విద్వాన్)

# వార్తలు.

17-6-54 నుండి 16 రోజులు పశ్చిమ గోదావరిజిల్లా పాలకొల్లు గ్రామమునందు శ్రీ శంకరానంద స్వాములవారి శ్రీ భగవద్గీతోపన్యాసములు వైభవోపేతముగ నెరవేరినవి. మధ్యలో 21-6-54 తేదీనాడు మధ్యాహ్నము శ్రీ శ్రీ శ్రీ షణ్ముఖానంద స్వామివారి ఆశ్రమమునందు ఉపాహారము స్వీకరించి కొంతసేపు సత్సాంగత్య ప్రభావమునుగూర్చి శ్రీ స్వామివారు ఉపన్యసించినారు.

పాలకొల్లునుండి 2-7-54 నాటిరాత్రికి తూర్పుగోదావరిజిల్లా రాజోలు తాలూకా మధ్యలంకయందు శ్రీ శ్రీ శ్రీ రాజేశ్వరానంద స్వాములవారిచే స్థాపింపబడిన శ్రీ ఈశ్వర సేవాశ్రమమునకు శ్రీ శంకరానంద రామకృష్ణులు చేరుకొన్నారు. 3-7-54 ఉదయం రాజోలు గ్రామంలో హనుమాలయంలోను, 4-వ తేదీ శ్రీ ఈశ్వర సేవాశ్రమమునందును ఉపన్యాసములు జరిగినవి. ఆరోజు రాత్రికి ర్యాలిగ్రామం చేరుకొన్నారు.

తూర్పు గోదావరిజిల్లా ర్యాలిగ్రామ వాస్తవ్యులు, సుప్రసిద్ధ వదాన్యులు, శ్రీమంతులు నగు శ్రీ సుబ్బరాయుడు నాగేశ్వరరావుగారి ఏర్పాటుతో నాడు నెలకొల్పిన అన్నదాన సత్రమునందు 5-7-54, 6-7-54 తేదీలు శ్రీ శంకరానందస్వామి వారి ఉపన్యాసములు జరిగినవి. శ్రీ వారు స్థితప్రజ్ఞ లక్షణములను గూర్చి ఉపన్యసించినారు. శ్రీ రామకృష్ణగారు అనువదించినారు.

ర్యాలినుండి రాజమండ్రి మార్గముగ శ్రీ శంకరానంద, రామకృష్ణులు మచిలీపట్టణం చేరినారు. హిందూదేవధర్మాదాయ కమీషనరుగారి ఆజ్ఞపై, డిప్యూటీ కమీషనరుగారగు శ్రీ సి. వి. యల్. వరప్రసాదరావుగారి ఆధ్వర్యమున మచిలీపట్టణము (బందరు) గొడుగుపేట శ్రీ నాగేశ్వరస్వామి వారి ఆలయములో, దేవాలయ ట్రస్టీగారగు శ్రీ ఆవటపల్లె హనుమంతరావుగారు శ్రీ భగవద్గీతోపన్యాసములను ఏర్పాటు చేసినారు. లౌడుస్పీకర్లు మూలమూలల నిర్వరచి వేలాదిజనసమూహమునకు భగవద్గీతామృతమును కర్ణగసాయనముగ త్రాపించిన శ్రీ హనుమంతరావుగారు శతశః ధన్యవాదార్హులు. ఉపన్యాసములు 8-7-54 నుండి 18-7-54 వరకు జరిగినవి. తర్వాత శ్రీ శంకరానందస్వామివారు హొస్పేట చేరినారు. శ్రీ రామకృష్ణగారు గండిక్షేత్రం చేరినారు.

ప్రతి సంవత్సరమువలెనే 10-8-54 నుండి 14-8-54 వరకు హంపిక్షేత్రమునందు శ్రీ శంకరానంద స్వాములవారి ఆధ్వర్యమున గీతాపురశ్చరణము జరుగగలదు. ఆ సందర్భమున, నూతనముగ నిర్మింపబడిన ఆశ్రమముయొక్క ప్రారంభోత్సవము పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ శాంతానంద స్వాములవారి అమృత హస్తములతో జరుపబడును. ఆ సమయమున శ్రీ శ్రీ శ్రీ అభేదానంద సరస్వతీస్వాములవారును శ్రీ రామకృష్ణానంద స్వామివారును ఆకార్యక్రమమున పాల్గొనగలరు.

---

# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీ శైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీశివాచార్యస్వాములవారు - 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీసీతారామాశ్రమం, గుళ్లదూర్తి, కోయిలకుంట్ల తా॥ - 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా. - 4. స్వర్గీయ సేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. - 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తాలూకా. - 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ - 7. శ్రీ తోమంద్ర రామసుబ్బయ్య శ్రేష్ఠిగారు, చాగలమర్రి. - 8. శ్రీఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, వై. కృష్ణాపురము, శిరివెళ్ళ తాలూకా. - 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. - 10 శ్రీ జి. వీరారెడ్డిగారు, వి.ఎం. ఎర్రగుడిదిన్నె, ఎర్రగుంట్లపోస్టు. - 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల. - 12. శ్రీబొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల, ఆళ్లగడ్డ, P.O.

కడపజిల్లా: 13. శ్రీహిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, పాలగిరి పోస్టు. - 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్. ఎస్. 15 శ్రీ పోలేపల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

చిత్తూరు జిల్లా: 16. శ్రీ మదళ్ళపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, బజార్ వీధి. చిత్తూరు. - 17. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, జవిళివ్యాపారం, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 18. పూజ్యపాద శ్రీ చిద్గనానంద మహర్షులవారు, శ్రీ భువనాశి ఆశ్రమం. - 19. శ్రీపోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు.

నెల్లూరుజిల్లా: 20. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాన్‌పేట, నెల్లూరు. 21. శ్రీ వేమారెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

గుంటూరు జిల్లా: 22. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, (తెనాలి)

ఉత్తర ఆర్కాడుజిల్లా: 23. శ్రీ ఆర్.పి. రామనాధంరెడ్డిగారు, కాటుకానూరు, కణ్ణమంగళం పోస్టు.

మైసూరుస్టేట్: 24. శ్రీ పెండుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పేట్, బళ్లారిజిల్లా. - 25. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్పశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పెట్ - 26. శ్రీ గంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణ దేవరకెరె. - 27. శ్రీ ఎం. వి. రామలింగయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట, కోలారుజిల్లా.- 28. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటి.

నైజాంస్టేట్: 29. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. - 30. శ్రీ పడిశాల భద్రయ్యగారు, వరంగల్ - 31. శ్రీసాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం శేశవపట్నం, కరీంనగర్ జిల్లా.

32 గ్రంథె నరసయ్యశ్రేష్ఠిగారు, నెం. 158 అణ్ణాపిళ్లెవీధి, మద్రాసు.

తూర్పుగోదావరి జిల్లా:- 33. శ్రీ సముద్రుపంతుల నాగేశ్వరరావుగారు, ర్యాలి.

పశ్చిమ గోదావరి జిల్లా:- 34. శ్రీరాజులపాటి వేంకటేశ్వరులు గారు, పాలకొల్లు. 35. స్వర్గీయ శ్రీమతి అద్దేపల్లి శేషరత్నమ్మగారి స్మారకముగ - భర్త శ్రీ సత్యనారాయణమూర్తిగారు, పాలకొల్లు.

కృష్ణాజిల్లా:— 35. శ్రీధూర్జటి సుబ్రహ్మణ్యంగారు, బందరు. — 36. శ్రీభట్టిప్రోలు సత్యనారాయణరావుగారు. సర్కిల్ పేట, బందరు.

## రాజపోషకులు రు. 54

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మారకముగ శ్రీ N. అయ్యప్ప రాజుగారు, గోసపాడు. — 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. — 3. శ్రీ చాటకొండు ఓబుళేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. — 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. — 5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. — 6. శ్రీ బైసాని రామదాసుగారు, ఆళ్లగడ్డ. — 7. శ్రీ డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ. — 8. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె, శిరివెళ్ల తాలూకా. — 9. శ్రీ N. రామిరెడ్డిగారు, డబ్లు. కొత్తపల్లె, కోయిలకుంట్ల తాలూకా. — 10 శ్రీ మదల్లపల్లె రామసుబ్బయ్యగారు, చాగలమర్రి. — 11. శ్రీ జూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్యశ్రేష్ఠిగారలు, చాగలమర్రి. — 12. శ్రీమతి ఆర్. సుబ్బరత్నమ్మగారు, నంద్యాల. — 13. శ్రీ పాణ్యాం రామచంద్రయ్యగారు, వకీలు, నంద్యాల. — 14. శ్రీ పాణ్యాం రామనాథశాస్త్రిగారు, — కోయిలకుంట్ల. —15. శ్రీ టి. సుబ్బయ్యగారు, జనరల్ మర్చంట్, పాణ్యాం.

కడపజిల్లా. 16. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తా॥ — 17. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దటూరు. — 18. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. — 19. శ్రీ పెంటంశెట్టి శ్రీనివాసశ్రేష్ఠిగారు, వేంపల్లి. — 20. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. — 21. శ్రీ ముమ్మడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తాలూకా.

చిత్తూరు జిల్లా: 22. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. — 23. శ్రీబల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె. — 24. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఎ., పెరియంబాడి. — 25. శ్రీ నటకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 26. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. — 27. శ్రీ బుస్సెట్టి వన్నప్పగారు, ఉరవకొండ. — 28. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు రాగలపాడు. — 29. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. — 30. శ్రీ కె. చౌడయగారు, జమీందార్, మిణకనగుర్కి. — 31. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, ఆలూరు తా॥ — 32. శ్రీ పటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 33. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 34. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. — 35, శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి. — 36. శ్రీ చిన్నకదిరప్పగారు, కుందనగుర్తి. — 37. శ్రీసాధు శివలింగప్పగారు, కుందనగుర్తి. — 38. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి — 39. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 40. శ్రీ శాకల ఆంజనేయులుగారు, కుందనగుర్తి. — 41. శ్రీ పాటిల్ పెద్దబశిరెడ్డిగారిభార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి.

నెల్లూరు జిల్లా: 42. శ్రీబ్రహ్మచారి బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము, కసుపర్తిపాడు.

ఉత్తర ఆర్కాడు జిల్లా: 43. శ్రీ శంకరనాయుడుగారు, కార్వేటి.

మైసూర్ స్టేట్: 44. శ్రీ కాకుబాళ అంబణ్ణ శ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పేట్ 45. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠి గారు, బంగారుపేట. — 46. శ్రీ కె. ఆర్. సీతారామయ్య శ్రేష్ఠి గారు, బంగారుపేట. — 47. శ్రీ కె. నంజప్ప శ్రేష్ఠి గారు, బంగారుపేట. — 48. శ్రీ నారాయణమూర్తి గారు, c/o నూరా విరూపాక్షయ్య గారు, తొండేభావి. కోలారు. — 49. శ్రీమతి కుసుమభాగ్యలక్ష్మమ్మ గారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

హైదరాబాదు స్టేట్: 50. శ్రీ పి. వి. రంగారావుగారు, వకీలు, నల్గొండ. — 51. శ్రీ దేశముఖ్ వేనేపల్లి కొండలరావు గారు, నల్గొండ — 52. నాగబండి విశ్వనాథం గారు, 12/88 మైక్రోరోడ్డు, వరంగల్. — 53. శ్రీమతి చిదిరాల వీరలక్ష్మమ్మ గారు, శ్రీ నృసింహ భక్తమండలి, 12/285 గిర్మాజిపేట, వరంగల్ — 54. శ్రీ గందె రాజయ్యగారి లింగయ్యగారు, కిరాణాదుకాణం, వరంగల్ — 55. శ్రీ తోటి కేదారిగారి చంద్రశేఖరం గారు, కిరాణదుకాణం, వరంగల్ — 56. శ్రీ తాటికొండ నాగయ్య గారు, రామన్నపేట, వరంగల్ — 57. శ్రీ పుల్లూది సూర్యనారాయణగారు, అడితిదుకాణం, వరంగల్ — 58. శ్రీ మడూరు బసవలింగం గారు, వరంగల్ — 59. శ్రీ కొమరవెల్లి సూరయ్య గారు, వరంగల్ — 60. శ్రీ యాదా నారాయణగారు, వరంగల్ — 61. శ్రీ గుని శెట్టి నాగలింగంగారు వరంగల్ — 62. శ్రీ తోటి జగన్నాథంగారి ముక్తేశ్వర్ గారు, కిరాణం మర్చంట్, వరంగల్ — 63. శ్రీ గన్ను బుచ్చయ్యగారు, అడితి దుకాణం, వరంగల్. — 64 శ్రీమతి కామేశ్వరమ్మ గారు c/o రవ్వా కైలాసం గారు, బట్టలదుకాణం, వరంగల్ — 65. శ్రీ సోమా నరసయ్య గారు, వరంగల్ — 66. శ్రీ వజినపెల్లి నరసయ్య గారు, వరంగల్ — 67. శ్రీ చందా పుల్లయ్యగారు, జనరల్ మర్చంటు, వరంగల్ — 68. శ్రీ చిదిరాల రాజశేఖరం గారు. వరంగల్ — 69. శ్రీ చెలుపూరు మంకయ్య గారు, బట్టల దుకాణం, వరంగల్.

కోయంబత్తూరు జిల్లా: 70. సి. ఎస్. నాగరాజ శ్రేష్ఠి గారు, కొల్లేగాలం.

కృష్ణాజిల్లా:— 71. ముక్త్యాల సీతయ్యగారి జ్ఞాపకార్థము ధర్మపత్ని శ్రీమతి నాగరత్నమ్మ గారు, ఈడుపుగల్లు. 72. శ్రీ బావినేని రామకోటయ్య చౌదరి, పరమాత్మానందాశ్రమము, గీతాభవనము, పెనమలూరు. — 73. శ్రీ అదూరి చలపతిరావు గారు. రుస్తుంబాద్, బందరు. — 74 శ్రీ మోటుమర్రి దయానిధి గారు, బందరు.

తూర్పుగోదావరిజిల్లా:— 75. శ్రీ సమయమంతుల పెద నాగేశ్వరరావు గారు, ర్యాలి. — 76. శ్రీ సమయమంతుల జగ్గారావు & బ్రదర్స్, ర్యాలి. — 77. శ్రీ సమయమంతుల రాధాకృష్ణరావు & బ్రదర్స్, ర్యాలి. — 78. శ్రీ మాధంశెట్టి జగ్గారావుగారు, ర్యాలి. 79. శ్రీ మాతంశెట్టి నాగరాజరావు గారు, ర్యాలి.

పశ్చిమగోదావరి జిల్లా:— 79. శ్రీ అబోతుల రామన్న గారు, పాలకొల్లు. — 80. శ్రీ మామిడి సత్యనారాయణ గారు, పాలకొల్లు.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావు గారు, మదరాసు — 16.
2. శ్రీ గజ్జహళ్లి క్కినాగిరెడ్డి గారు, వంటవాగలి, ఆలూరు తాలూకా. (కర్నూలు)

Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkuntla.
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President,
Sri Gita Sahitya Sevasamithi, Allagadda — Kurnool (Andhra)

ఓం

# గీ త రో !

నిర్విషయానంద బ్రహ్మచారి.

ఉ॥ ఎందరునిన్ను చేతగొని యీ భవవార్ధిని దాటగోరి యా
నందముతో బఠించుచు ఘనంబగు మోక్షము జెందిరీయిలన్
సందియమేమి? నాకికన సర్వమునీవని సేవజేతు నా
యందలి లోట్ల బోనడచుమమ్మ! కృపారసదృష్టి గీతరో!

ఉ॥ మందుడు నిన్ను చేతగొని మాపును రేపును భక్తియుక్తుడై
యందముగాబఠించిన మహాత్ముడు కాగలడమ్మ! దీనిలో
సందియమేమి? మూఢుడను జాడ్యమనీషిని నిన్ బఠించి నా
మందత బాసినాడ ననుమానములేదు నిజమ్ము గీతరో!

ఉ॥ చెప్పెదువమ్మ! సర్వులకు క్షేమముగల్గెడి దివ్యమార్గమున్
మెప్పున నొక్క జాతినిల మేటిని జేయువుయోగ్యతన్ సదా
గొప్పగ సెప్పుచుండెదవు గోప్యములన్ వెలిబుత్తు వెంతయున్
తప్పక నిన్ బఠించగల దార్ఢ్యము జేకురజేయు గీతరో!

చ॥ యమనియమాది యోగముల నాచరణంబును సల్పలేకనే
క్రమముగ నిన్ బఠించుచు వికాసము బొందితి సత్యమమ్మ! నీ
సమరస భావసంపదను సంస్తుతిజేయగ నాకు శక్యమే?
విమలయశస్స్వరూపిణి! వివేకసుధారసపూర్ణ! గీతరో!

చ॥ చదువుచునుండ నిన్ను ల.....ప జగంబునుదాటి యెద్దియో
కదలికలేని దివ్యనిధిగాంచి మహాముదమొంది వెంటనే
వదలి జగంబుపై పునకు వచ్చుట కెంతయు కష్టమొందు నీ
సదమలభావ సౌష్ఠవము సన్నుతిజేయగ నానె? గీతరో!

---

# సన్మాన పత్రము.

(17-6-54 నుండి 2-7-54 వరకు పశ్చిమగోదావరిజిల్లా పాలకొలను గ్రామము శ్రీక్షీరరామలింగేశ్వరస్వామివారి ఆలయావరణములో జరిగిన శ్రీ భగవద్గీతోపన్యాసముల సందర్భమున శ్రీశ్రీశ్రీ శంకరానందస్వాములవారికి సమర్పించిన పద్యపంచరత్నములు.)

శా॥ ప్రాంచద్భాష్య పదానుకూల విపులవ్యాఖ్యాన సద్వైఖరీ
సంచారాద్భుత వాగ్విలాసకలనా చాతుర్య ధుర్యస్థితి
న్గాంచిజ్జుల్ పరమార్థబోధ తెలియ న్వేదాంత సింహంబు గ
ర్జించెన్ నాస్తిక సింధురంబులదరన్ శ్రీ శంకరానందులై. 1

చ॥ కరుణవచించె గీత నధికారి ధనంజయుడంచు మాధవుం
డొరులకుఁ జెప్పకీ విబుధుఁడో! యధికారులు కానివారి నం
దఱు నధికారులన్ సలిపి తత్త్వరహస్యముపన్యసించె విం
తరుచి జనింపఁ గృష్ణునకు దక్కెనె యీదృశ యశమ్మిలన్. 2

సీ॥ అమృతంబు మోహిని యందిచ్చువేళ సురాసురబృందము లలరవింటి
శ్రీరామపట్టాభిషేక సమయమందు లక్షలాదిప్రజల్ చెలఁగ వింటి
మురభేదనుఁడుతొల్లి మురళివాయించఁగాజనులుగుంపులుగూడివినుటవింటి
రాజసూయంబు ధర్మజుఁడు జేయఁగ నసంఖ్యాక భోక్తలు చేరిరనగవింటి
గీ॥ లేదు పట్టాభిషేకంబు లేదమృతము గానసభకాదు లే దన్నదానమైన
నేమహత్త్వంబుచేఁగూడిరిందఱిచటశంకరానందసంయమీశ్వర!మహాత్మ!

శా॥ ఏసన్మానముజేసి నీఋణముఁ దారీగంగలారిప్పుడున్
శ్రీసంపన్నులు, నూలుపోగొకటియే శీతాంశునిన్ దన్పు న
ట్లీ సందర్భమునన్ నమస్కృతులకే తృప్తిన్ బ్రదర్శింపఁగా
నే సంప్రార్థన మాచరించెద సభన్ నిష్కామయోగీశ్వరా! 4

శా॥ శ్రీనారాయణుఁడైన కృష్ణుని మదిన్ జింతించుచోఁ బార్థునిన్
మానంజాలుదుమే స్మరింపకటులే మా శంకరానందుపై
ధ్యానంబుంచెడి వేళలన్ స్మృతిపథంబందెప్పుడున్ రామకృ
ష్ణానందున్ మఱువంగలే మతని వాచామాధురిన్ గ్రోలుటన్. 5

— ఆత్మానంద.

శ్రీవేదవ్యాస ప్రెస్, చిత్తూరు, ఆగస్టు 1954 కా.1000.